# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సాంస్కృతిక మాస పత్రిక




## చందా వివరాలు

| | |
|---|---|
| 3 సంవత్సరాల చందా | రూ.100/- |
| సంవత్సర చందా | రూ.36/- |
| ఎయిర్ మెయిల్ (1 సం॥) | రూ.130/- |
| సీ మెయిల్ (1 సం॥) | రూ.75/- |

చందా పంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9, దేశికా రోడ్, మైలాపూర్, మద్రాస్-600004

ఫోన్:73327

# ఈ సంచికలో

ఆగస్టు 1991



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
జగన్మోహన్

**తెలుగు విస్డమ్‌కు ఇది పదవ సంవత్సరం**

## ధ్యానం

# నిష్ఠకు మొదటిమెట్టు


జేమ్స్ ఎలెన్

మానవ మనస్సు చంచలం. ఒక్క నిముషం కూడా నిలకడగా ఉండదు. ఒకదాని మీద నిలవదు. అందుకే నీవు చంచలుడవు. చంచలమైన మనస్సుని స్వాధీనంలో పెట్టుకోవాలి. క్రమశిక్షణతో నిష్ఠను అభ్యసించాలి. దీనికి బద్ధకాన్ని పోగొట్టుకోవాలి. దీనిని దిగ్విజయంగా సాధించి మొదటి మెట్టును ఎక్కగలిగితేగాని పైపై మెట్లను ఎక్కలేవు. సోమరితనం సత్య పథానికి అవరోధం. శరీరానికి అవసర మైన దానికంటె అధిక సుఖ సంతోషాల వల్ల, అధిక నిద్ర వల్ల సోమరితనం ప్రవృద్ధి పొందుతుంది. బద్ధకం ఆవహిస్తుంది. మొండికెత్తడం, వెంటనే చేయవలసిన పనిని ఎప్పటికప్పుడు చేయకుండా వాయిదాలు వేయడం మొదలైనవన్నీ

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# చిరునవ్వు ఆనందాన్ని పెంచుతుంది

చిరునవ్వుతో కళకళలాడే ముఖం ఒక ప్రత్యేక వ్యక్తిత్వం. చిరునవ్వుతో వికసించిన మామూలు ముఖం ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. ముఖం మీద నవ్వు అనేది ముఖవైఖరినే పూర్తిగా మార్చేస్తుంది. ముఖం మీద విచారం వల్ల ఏర్పడే ముడతలకు బదులు విలాసవంతమైన విస్తృత వలయాలు కనబడ తాయి.

మానసికంగా, సామాజికంగా చిరునవ్వు విలువ అమూల్యం. మనస్సులో ఆశాజనకమైన భావాలు బయలుదేరినప్పుడు ముఖం మీద చిరునవ్వు వికసిస్తుంది. ఈ చిరునవ్వు యోచనాశక్తిని ఉత్తేజపరచి నిమ్మళ్మమం చేస్తుంది. మందహాసం ఒక విధమైన ఆనందాను భూతిని కలిగిస్తుంది. ఎదుటి వారిలో ప్రేమాభి మానాలు పెరుగుతాయి. పరస్పర స్నేహం అభివృద్ధి పొందుతుంది. సద్బాంధవ్యానికి గట్టి పునాదులు నిర్మించబడతాయి

ఇద్దరు వ్యక్తులు ఒకరిని ఒకరు కలుసు కున్నప్పుడు కొంత ఒత్తిడి ఏర్పడటం సహజం. చిరునవ్వు ఈ ఒత్తిడిని తొలగిస్తుంది. చిరునవ్వు నవ్వే వ్యక్తి స్నేహ బీజాలను నాటు తాడు. ఎదుటి వ్యక్తికి కష్టం అనిపించదు. ఒక విధమైన అనిర్వచనీయమైన ఆనందం అనుభవిస్తాడు. ఆత్మాభిమానం పెరుగుతుంది. చిరునవ్వు మన జీవితాలనే కాదు, ఎదుటివారి జీవితాలను కూడా ఉత్సాహపూరితం చేస్తుంది.

ఇతరులు మనకు సహాయం చేసినప్పుడుగాని

"సంతోషం సగం బలం."

మెచ్చుకున్నప్పుడు గాని మనఃపూర్వకంగా నవ్వుతో అభినందించాలి. నవ్వుతో ఇచ్చి అభిమాన పూర్వకంగా సేవ చేయగల కళను అభ్యసించు. యథార్థమైన ఆనందాన్ని అనుభవించాలంటే ఇతరులకు సంతోషంగా సహాయం



చేయి. మానసికంగా నెమ్మదిని, శాంతిని పొందడానికి ప్రారంభించు మనిషి ప్రశాంతంగా ఉన్నప్పుడు స్వచ్ఛమైన సంతోషం ముఖంమీద తాండవిస్తూంటుంది

ముఖంమీద చిరునవ్వు శరీర సౌందర్యాన్ని ఇనుమడించే అమూల్య ఆభరణం చిరునవ్వు ముఖానికి అమోఘమైన సహజ వ్యాయామం. దిగ్విజయంతో సమాజంలో గౌరవం పొందడానికి రహస్యం చిరునవ్వు చిరునవ్వు ఫలితం అందరికీ తెలిపినది కాదు. ఉత్సాహంతో స్ఫూర్తిని కలిగించుకోడానికి చిరునవ్వును మించినది వేరొకటి లేదు. చిరునవ్వు విచారం అనే చీకటి మేఘాలను పారద్రోలి జీవితంలో ఆనందాన్ని ప్రకాశింపజేస్తుంది.

●

## గ్రేట్ బ్రిటన్‌లో మూడు భాషలు

*గ్రేట్ బ్రిటన్‌లో ఇంగ్లీషు, వెల్ష్ (Welsh) మరియు గెలిక్ (Gaelic) భాషలు మూడు ఉన్నాయి.*

## ఒలింపిక్ జ్యోతి వెలిగించిన ప్రప్రథమ మహిళ

*మహిళా క్రీడాకారిణి ఎన్‌రిక్వేటా బాసిలియో 1968 మెక్సికో ఒలింపిక్ జ్యోతిని వెలిగించి చరిత్రను సృష్టించింది. ఈమే ఒలింపిక్ జ్యోతిని వెలిగించిన ప్రప్రథమ మహిళ.*

## భారతదేశపు మొట్టమొదటి సేవింగ్స్ మునిసిపాలిటీ

*కేరళ పాల్ఘాట్ జిల్లాలో చిత్తూర్ తదామంగళం మునిసిపాలిటీని భారతదేశపు మొట్టమొదటి సేవింగ్స్ మునిసిపాలిటీగా ప్రకటించారు. ఇక్కడ ఉన్న 5,322 కుటుంబాలన్నిటికీ పోస్టాఫీసు రికరింగ్ అక్కౌంటులు ఉన్నాయి.*

( 2 వ పేజీ తరువాయి)

బయలుదేరతాయి. సకాలంలో పనులు సక్రమంగా నిర్వర్తించు కోవడం నిత్య జీవితంలో దివ్యయోగం. సూర్యోదయానికి ముందుగా నిద్రలేవడం వల్ల, శరీరానికి అవసరమైన దానికన్నా అధికంగా నిద్ర పోకుండా ఉండడం వల్ల, ఉత్సాహంతో ఎప్పటి పనులు అప్పుడు చేయడం వల్ల సోమరితనం పోతుంది. అప్పుడు ఉత్సాహానికి, ఆసక్తికి, ఆకాంక్షకి ఉద్దీపన కలుగుతుంది. బుద్ధి చురుకుగా ప్రకాశించినప్పుడు బాట స్పష్టంగా కనిపిస్తుంది. నడక సవ్యంగా కొనసాగుతుంది. క్రియాశక్తి పెరుగుతుంది.

●

"లోపాలు లేని మనిషి ఉండడు. తక్కువ లోపాలు ఉన్నవాడు ఉత్తముడు."

# ఈ శతాబ్దంలో

## మొట్టమొదటి లైవ్ టెలివిషన్

మొట్టమొదటి లైవ్ టెలివిషన్ ప్రపంచంలో నేపాల్ - టిబెట్ సరిహద్దు (హిమాలయాలు)లో



ఎత్తైన ప్రదేశం ఎవరెస్ట్ పర్వత శిఖరం నుంచి 1988 మే 5న జపాను టెలివిషన్ వారిచే ప్రసారం చేయబడింది.

## మొట్టమొదటి న్యూక్లియర్ సబ్‌మెరైన్

జార్జి వాషింగ్టన్ అనే మొట్టమొదటి న్యూక్లియర్ సబ్‌మెరైన్ పోలారిస్ ఆయుధాలతో యు.ఎస్.ఎ.లో 1959 జూన్ 9న ప్రవేశపెట్టబడింది.

## ఇజ్రేల్, సౌత్ వెస్ట్ ఆసియా రిపబ్లిక్

మధ్యధరా సముద్రంలో సౌత్ వెస్ట్ ఆసియా రిపబ్లిక్ ఇజ్రేల్ 1948 మే 14న జ్యూయిష్ హోమ్‌గా స్థాపింపబడింది. దీనికి డేవిడ్ బెన్ గురియన్ (David Ben Gurion) మొట్టమొదటి ప్రధాన మంత్రి.

## చంద్రగోళం అవలి దృశ్యం

1959 అక్టోబర్ 7న మొట్టమొదటి చంద్ర

## సోడావాటర్ 'పుట్టుక

సోడా వాటర్ 1777లో మొట్టమొదట వాడబడింది. 18,19 శతాబ్దాలలో ముఖ్యంగా జీర్ణకోశ సంబంధమైన వ్యాధులను కుదర్చడానికి ఆరోగ్యవంతమైన స్ఫటికం వంటి "స్పా వాటర్" (Spa water) ను ఉపయోగించేవారు. డా. జోసెఫ్ ప్రీస్ట్లీ ఇటువంటి నీటిని తయారుచేయాలని ఉద్యమించాడు ఈ నీటిలో $CO_2$ (కార్బన్ డై ఆక్సైడ్) ఉందని తెలుసుకున్నాడు కాబట్టి నీటిలో $CO_2$ (కార్బన్ డై ఆక్సైడ్)ను కలప డానికి ప్రయత్నాలు చేసాడు. దీనికి బైకార్బొనేట్ ఆఫ్ సోడా ఆష్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ కలిపి కృత్రిమంగా కార్బన్ డై ఆక్సైడ్ ($CO_2$)ను ఉత్పాదించి దీనిని నీటిలోకి పంపి మొట్టమొదట ఇతడు స్పా వాటర్‌ను తయారుచేసాడు దీనికి అతను సోడావాటర్ అని పేరు పెట్టాడు

# వింత అలవాట్లు

## చివరి జాగ్రత్త

ఒకప్పుడు జరిగిన గన్ పౌడర్ ప్లాట్ తిరిగి సంభవించకుండా ఉండటానికి బ్రిటన్‌లో పార్లమెంట్ ప్రారంభించేముందు భూమి అడుగున రూములు (సెల్లర్స్) ఆఖరి జాగ్రత్తగా తనిఖీ చేస్తారు

## సుష్టుగా భోజనం తరువాత

కొన్ని అరబ్ జాతులలో సుష్టుగా భోజనం అయిన తరువాత ఎంత గట్టిగా వీలైతే అంత గట్టిగా తేనువు తేన్పడం అలవాటు. ఎంత గట్టిగా త్రేనిస్తే అంత మంచిది.

"ద్వేషం దీర్ఘ కాలం పాటు సాగే ఆత్మహత్య."

గోళం అవలి ప్రక్క (far side of the moon) చాయాచిత్రం తీయబడింది. ఈ బొమ్మలు సోవియట్ యూనియన్ కృత్రిమ ఉపగ్రహం లూనిక్ III సహాయంతో భూమి మీదికి ప్రసారం చేయబడ్డాయి

## పనామా కాలువ

పనామా భూసంధి మీదుగా కరీబియన్ మహాసముద్రాన్ని పసిఫిక్ మహా సముద్రాన్ని




కలిపే 64 మీటర్ల పొడవైన పనామా కాలువ 1914 ఆగష్టు 15 న తెరవ బడింది. ఎస్.ఎస్ ఆన్‌కోన్ ఈ కాలువ ద్వారా ప్రయాణం చేసిన మొట్టమొదటి ఓడ.

## ప్రపంచంలో మొట్టమొదటి నీటితలం క్రింద పెళ్ళి

ఇద్దరు డేనిష్ టూరిస్టులు ఫ్లెమింగ్ కోచ్ మరియు నినాటోల్ గార్డ్ 1988 మే 23న మారిషస్‌లో (హిందూ మహాసముద్రపు ద్వీప కల్పం) నీటి అడుగున రీఫ్ మీద పెళ్ళి చేసుకున్నారు ఇదే బహుశః మొట్టమొదటి నీటి అడుగున పెళ్లి అయి ఉండాలి. వీరిద్దరూ పరస్పరం ప్రమాణాలు స్వీకరించడానికి "డైవర్స్" (divers) భాష ఉపయోగించారు. అడుగు భాగం గాజుతో చేయబడిన పడవ మీద సివిల్ సర్వీస్ ఉద్యోగి వీరి వివాహాన్ని నడిపించాడు

## మీటర్ గేజ్ సబర్బన్ సర్వీస్ 1931లో ప్రారంభమైంది

***మద్రాను బీచ్ మరియు తాంబరం మీటర్ గేజ్ సబర్బన్ సర్వీను 1931 లో ప్రారంభమైంది. వెంటనే DC ట్రాక్షన్‌తో ఎలక్ట్రిక్ మల్టిపిల్ యూనిట్ సర్వీసెస్ ప్రారంభించబడ్డాయి ఇది 1967 లో 25 KV ac ట్రాక్షన్‌గా మార్చబడింది.***

# పిల్లలకు ఆరోగ్యసూచనలు

1. నీ గురించి నువ్వు తెలుసుకో: నీ శరీరం ఏవిధంగా ఎప్పటి కప్పుడు ఎలా మారుతూందో, పెరుగుతూందో తెలుసుకో.

2. నీ శరీరం శుభ్రంగా ఉంచుకో: తరచు స్నానం చేస్తూండు, పళ్ళు శుభ్రంగా తోముకుంటూండు, గోళ్లు శుభ్రం చేసుకో, పాదాలు శుభ్రంగా ఉంచుకో.

3. బాగా తిను: నీ శరీరం బాగా పెరగాలి పళ్ళు, కాయగూరలు పుష్కలంగా తిను. అధికంగా తీపి పదార్థాలు, ఉప్పు తినకు. చ్యూయింగ్ గమ్ తినడం మానుకో.

4. జాగ్రత్తగా ఆడుకో: స్కూలులో ఆటలు ఆడేటప్పుడు జాగ్రత్తగా మసలుకోడం నేర్చుకో. రోడ్లు దాటేటప్పుడు జాగరూకత వహించు

5. స్నేహాన్ని పెంచుకో: మంచి స్నేహితుడువిగా ఉండు. చిన్నవారితోను, పెద్దవారితోను స్నేహం పెంచుకో. ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు చెప్పినట్టు విను వారిని గౌరవించు.

6. నీ ప్రపంచం శుభ్రంగా ఉంచుకో: నీ ఇల్లు, నీ వీధి, నీ స్కూలు, నీ పరిసరాలు అన్నీ నివాసయోగ్యంగా ఉంచుకో.

7. 'No' అని చెప్పడం నేర్చుకో: నీకు ఇష్టం కాని పనులు ఏవైనా ఎవరైనా చేయమంటే 'No' అని చెప్పు. మందులకు (drugs) కూడా అదే మంత్రం 'No'.

8. ఔషధాలు: ఔషధాలతో చెలగాటం వద్దు. నీ తల్లిదండ్రులు, వైద్యుడు నీ ఆరోగ్యాన్ని కోరేవారు. వారు ఇచ్చినవి మాత్రమే వేసుకో.

9. టీకాలు: తీవ్రమైన చిన్నపిల్లల వ్యాధులను నివారించుకోవచ్చు ఎన్నెన్నో టీకా మందులు ఉన్నాయి నీకు తగిన రక్ష ఉందా అని చూసుకో

## ప్రపంచంలో ప్రఖ్యాత శాకాహారులు



RALPH WALDO EMERSON

ప్రపంచంలో ప్రఖ్యాత పురుషులు కొంతమంది శాకాహారులు. వీరు - లియో టాల్‌స్టాయ్, హెచ్.జి. వెల్స్, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, జార్జి బెర్నార్డ్ షా, ఆల్బర్ట్ స్క్వాట్‌జర్, మహాత్మాగాంధీ, హెన్రీ డేవిడ్ థోరో, ఎమర్సన్, చార్లెస్ డార్విన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, ఓల్టైర్, సర్ ఐజాక్ న్యూటన్, లియోనార్డో డా విన్సీ, విలియం షేక్స్‌పియర్ మరియు ప్రాచీన రోము, గ్రీసులో వర్జిల్, ప్లేటో, పైథాగరస్.

—సి.ఎస్. మహాదేవన్

"లోక మాన్యుడగు వానికి అపకీర్తి మృత్యువుకంటే దుఃఖదాయకము."

# అవీ - ఇవీ

## అమెరికన్ కుటుంబాల అద్దె ఖర్చులు

ప్రస్తుతం 10 మిలియను అమెరికన్ కుటుంబాలు తమ ఆదాయంలో మూడవ వంతు సొమ్ము అద్దెలకు ఖర్చు పెడుతున్నారు.

## 100,000 డాలర్ల కెమెరా బొమ్మలను 100 రెట్లు పెంచుతుంది

యు.ఎస్.ఎ.లో 555 అడుగుల వాషింగ్టన్ మాన్యుమెంటు పైన పెట్టబడిన 100,000 డాలర్ల కెమెరా ఒకే ఆపరేటర్‌తో పనిచేస్తుంది దీనికి అమర్చబడిన టెలిఫోటో లెన్స్‌తో కెమెరా ఛాయాచిత్రాలను 100 రెట్లు పెద్దవిగా చేస్తుంది. ఇటీవల గోర్బచేవ్ వాషింగ్టన్‌లో ప్రయాణం చేసినప్పుడు ఫోటోలు తీసింది

## ప్రపంచంలో రెండవ మిక్కిలి పెద్ద నూనె నిక్షేపాలు

కమ్యూనిష్ట్ దేశాలు మినహాయింపుగా సౌదీ అరేబియా తరువాత యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (UAE) ప్రపంచంలో రెండవ మిక్కిలి పెద్ద నూనె నిక్షేపాలకి ప్రసిద్ధి పొందింది. ఇక్కడి నూనె నిక్షేపాలు 92 బిలియన్ బారల్స్ అని అంచనా వేయబడింది.

## రోడ్డు పరిస్థితుల అశ్రద్ధవల్ల సాలీనా రూ. 4,000 కోట్ల నష్టం

రోడ్ల పరిస్థితులు బాగాలేకపోవడం వల్ల రోడ్లు ఉపయోగించే వారికి సాలీనా రూ. 4,000 కోట్లు నష్టం ఏర్పడుతూంది. 2000 సంవత్సరం నాటికి 75% సరకుల రవాణా, 85% ప్రయాణీకుల రవాణా రోడ్లమీద జరుగుతుంది.

## భూగర్భ జలాలమట్టాలు అతిశీఘ్రంగా తగ్గిపోతున్నాయి

భారతదేశంలో 15 రాష్ట్రాలలో మొత్తం 54,310 గ్రామాలలో భూగర్భ జలాల మట్టం బాగా తగ్గిపోయి తీవ్రమైన నీటి ఎద్దడిని సూచిస్తూంది.

## వార్తలు పంపడానికి డప్పులు ఉపయోగిస్తారు



జెయ్‌రే మరియు మరికొన్ని ఆఫ్రికా దేశాలలో ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి వార్తలు పంపడానికి డప్పులు ఉపయోగిస్తారు. వివిధ వార్తలకు వివిధ స్థాయిలలో డప్పులు శబ్దం చేస్తారు. ప్రతీ వార్త బాగా తెలిసే దాకా నాలుగైదుసార్లు వాయిస్తారు. ఈ డప్పుల శబ్దం సామాన్యంగా 16 కి.మీ.ల దూరం ఉన్న గ్రామాలకు కూడా వినిపిస్తుంది.

"దేవతా ప్రదత్తములగు వస్తువులను దేవతకు నియోగింపక భోగించు వాడు పాపియే."

## మొట్టమొదటి స్వదేశీ ఆయిల్ టాంకర్

భారతదేశపు మొట్టమొదటి స్వదేశీ నిర్మిత ఆయిల్ టాంకర్ - 86,000 dwt మోతీలాల్ నెహ్రూ. దేశంలో నిర్మించబడిన ఈ మిక్కిలి పెద్ద నౌకను కొచ్చిన్ షిప్‌యార్డ్‌వారు షిప్పింగ్ కార్పొరేషన్ వారికి అప్పచెప్పారు 238 మీటర్ల పొడవు, 38 మీటర్ల వెడల్పుగల ఈ ఓడకి సుల్జర్ అనే సమర్థవంతమైన ఇంజను అమర్చ బడింది. దీని నిర్మాణానికి 101 33 కోట్లు ఖర్చు అయింది. దీనిని 44.6 కోట్ల నష్టానికి అమ్మారు.

## జోకులు చెప్పడంలో ప్రపంచ రికార్డు

పెరూలో సుప్రసిద్ధ టెన్నిస్ ఆటగాడు మరియు బుల్ ఫైటింగ్ వ్యాఖ్యాత పెలిపి కార్నేనెల్ జోకులు చెప్పడంలో ప్రపంచ రికార్డును స్థాపించాడు ఇతడు ఆగకుండా100 గంటల సేపు జోకులు వేసాడు. స్పానిష్, ఇంగ్లీష్. ఫ్రెంచి, ఇటాలియన్ మరియు పోర్చుగీసు భాషలలో మొత్తం 8,000 జోకులు చెప్పాడు.

## ప్రపంచంలో మిక్కిలి అధునాతనమైన టెలిస్కోపు

ప్రపంచంలో మిక్కిలి అధునాతనమైన టెలిస్కోపు - న్యూ టెక్నాలజీ టెలిస్కోపు (NTT) లాటిన్ అమెరికా అటకామా ఎడారిలో స్థాపించ బడింది. ఈ NTT టెలిస్కోపు వ్యాసం 3 5 మీటర్లు, బరువు ఆరుటన్నులు దీనికి 78 ఎలక్ట్రానిక్ కంట్రోల్డ్ సపోర్టు ఎలిమెంటులు ఉన్నాయి దీనిని 15 బిలియను లైట్ ఇయర్స్ దూరంలో ఉన్న క్రొత్త ఖగోళరాసులను తెలుసుకో డానికి ఉపయోగిస్తారు

## 40 మిలియను సంవత్సరాల నాటి పుర్రె త్రవ్వబడింది

క్రమక్రమంగా మనిషి రూపంలోకి మారిన ఆదిమ కోతి రూపపు ప్రాణి పుర్రె-సుమారు 40 మిలియను సంవత్సరాల నాటి పురాతనమైన దానిని ఇటీవల ఈజిప్షియన్ క్వారీలో కనుగొన బడినట్టుగా యు.ఎస్.ఏ.లో డ్యూక్ యూనివర్శిటీకి చెందిన ఎల్విన్ సైమన్స్ చెబుతున్నారు. ఇంతవరకు కనిపెట్టబడిన ఏ శిలాజం కంటె ఇది సుమారు 8 మిలియను సంవత్సరాలు పురాతనమైనది.

## అతి దీర్ఘమైన టెన్నిస్ మాచ్



*వింబుల్డన్ (ఇంగ్లండు)లో 1969 లో ఆడిన టెన్నిస్‌మాచ్ 5 1/4 గంటల సేపు ఆడబడింది ఈ సుదీర్ఘమైన మాచ్‌లో ఆర్.గోన్‌జేల్స్ (యు.ఎస్.ఎ) సి.పసరెల్ (యుఎస్ఎ)ని 22-24, 1-6, 16-14, 6-3, 11-9 తో ఓడించాడు*

"శ్రేష్ఠులు దేనిని ప్రామాణిక బుద్ధితో అనుష్ఠింతురో సాధారణ జనులు కూడా దానినే అనుసరింతురు.''

# కంప్యూటర్లకు ఫజ్జీ లాజిక్

కచ్చితంగా సంఖ్యా సంబంధమైన విలువలలో చెప్పలేని పరిమాణాలను లేక డిగ్రీలను నిర్వహించడానికి ఫజ్జీ లాజిక్ కంప్యూటర్లకు సహకరిస్తుంది. సాంప్రదాయక కంప్యూటర్లు నిర్దిష్ట సంఖ్యతో మాత్రమే వ్యవహరించగలవు. కాని



ప్రపంచంలో 'rather hot, 'somewhat hard, slightly shady వంటి దాదాపు, రమారమి, ఉజ్జాయింపులతో అనేక విషయాలు చెప్పబడుతున్నాయి. ఇప్పుడు ఈ విషయాలను కంప్యూటర్లు అతి సౌలభ్యంగా నిర్వహిస్తున్నాయి. "ఫజ్జీ ఫంక్షన్" అనే తర్క శాస్త్రాన్ని అందుబాటులోకి తీసుకు రావటం వల్లే ఇది సాధ్యమవుతూంది. ఇది అసందిగ్ధమైన పరిమాణాలను సంబంధిత పరిభాషలో వివరిస్తుంది.

ఫజ్జీ లాజిక్‌ను మొట్టమొదట 1965 లో ప్రస్తుతం కాలిఫోర్నియా యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా ఉన్న లోట్‌ఫీ ఎ. జాడె ప్రపంచంలో ప్రవేశ పెట్టాడు. చాలా కాలం వరకు ఏదో కొంత మంది గణిత శాస్త్రజ్ఞులు మాత్రమే జాడె చెప్పిన నూతన విషయం ప్రాశస్త్యతను గ్రహించారు. కాని 1980వ సంవత్సర ప్రారంభంలో దీని వినియోగం క్రమక్రమంగా అభివృద్ధి పొందింది.

'ఫజ్జీ లాజిక్' అనువర్తింప చేసినప్పుడు ఫజ్జీ రీజనింగ్ ప్రారంభమవుతుంది. దీంట్లో 'ఐతే' (if-then) నిబంధనలతో జడ్జిమెంట్స్ తిరిగి తిరిగి వస్తాయి. ఉదాహరణకి ఎయిర్ కండిషన్‌ల నియంత్రణలో ఫజ్జీ రీజనింగ్ ఈ విధంగా ఉంటుంది. "గది ఉష్ణోగ్రత వాంఛనీయమైన ఉష్ణోగ్రతను బాగా మించిపోతే కూలింగ్ ఫంక్షన్ సార్థకంగా పెరగాలి. గది ఉష్ణోగ్రత కొద్దిగా పెరిగితే కూలింగ్ ఫంక్షన్ మార్పు లేకుండా ఉండాలి." సాంప్రదాయక కంప్యూటర్లలో ఇటువంటి నాజూకు పరిస్థితులను క్రమబద్ధం చేయడం చికాకుగా ఉంటుంది ఎందుకంటే గది ఉష్ణోగ్రతకు ఏ కొంచెం పెరిగినా, తగ్గినా ప్రతిసారీ ప్రతిక్రియ తీవ్రంగా ఉంటుంది. పెద్ద పెద్ద భవనాలలో మల్టిపుల్

## జపానులో ఆయుర్దాయం అధికం

*ప్రపంచం జనాభాలో మూటికి రెండు వంతుల మంది ఆయుర్దాయం 60 సంవత్సరాలు, దానికిపైన. పారిశ్రామిక దేశాలలో నగటు జీవిత ప్రమాణం 73 సంవత్సరాలు. అభివృద్ధి పొందుతూన్న దేశాలలో ఇది 57 సంవత్సరాలు. ప్రపంచంలో జపానులో జీవిత ప్రమాణం పురుషులకు 75.5, స్త్రీలకు 81.6 సంవత్సరాలు - అత్యధికం. 2,000 సంవత్సరం నాటికి ప్రపంచం మొత్తం 600 మిలియను జనాభాలో 60 సంవత్సరాలు దానికి పైబడిన వారిలో మూటికి రెండు వంతుల మంది అభివృద్ధి పొందుతూన్న దేశాలలో ఉంటారు*

*—వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్*

"దోషముతో కూడిన స్వధర్మానుష్ఠానము చక్కగా నిర్వహింపబడిన పరధర్మముకంటే ఉత్తమతరము."

ఎలివేటర్ విధానాలను నియంత్రించడానికి "ఫజ్జీ లాజిక్" ఉపయోగించబడుతుంది. వివిధ అంతస్తుల దగ్గర ఎలివేటర్ కోసం నిరీక్షిస్తున్న వారి సంఖ్య సమయాన్ని బట్టి మారుతూంటుంది. 'ఫజ్జీ లాజిక్‌ను ఉపయోగిస్తే సగటు నిరీక్షణ సమయాన్ని బాగా తగ్గించడానికి వీలు పడుతుంది.

ఈ నాడు ఫజ్జీ లాజిక్‌ను మురికి నీటి శుద్ధీకరణ (sewage treatment), ఎలక్ట్రిక్ డిస్చార్జి ప్రాసెసింగ్, ఇండస్ట్రియల్ రొబొటిక్స్ మరియు ఆటోమాటిక్ మెషరింగ్ విధానాలలో కూడా ఉపయోగిస్తున్నారు. ఫజ్జీ లాజిక్ ప్రకారం వివిధ వివరాలను తయారుచేసే హార్డ్ వేర్ సాంప్రదాయకమైన మైక్రోప్రాసెసర్. దీనియందు ఫజ్జీ లాజిక్ సాఫ్ట్ వేర్‌గా ప్రవేశ పెట్టబడింది. కాని సాంప్రదాయక మైక్రోప్రాసెసర్లు ఈ పనికి పూర్తిగా అనుకూలపడవు

ఈ లోపాన్ని నిర్వహించడానికి జపానులో ఫజ్జీ లాజిక్‌తో ప్రత్యేకంగా ఉపయోగించడానికి ఒక IC (ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్) చిప్ అభివృద్ధి చేయబడింది. ఒకి (OKI) ఎలక్ట్రిక్ ఇండస్ట్రీ కంపెనీ వారు అభివృద్ధి పరచిన దానికి 7.5 -MFLIPS సామర్థ్యత ఉంది. ఒమ్రాన్ కార్పొరేషన్ వారు అభివృద్ధి చేసిన దానికి 10-MFLIPS సామర్థ్యత ఉంది.

MFLIPS అంటే సెకండుకి మిలియను రెట్లు ఫజ్జీ తర్కంతో స్టెప్పులు చేయడం (మిలియను ఫజ్జీ లాజిక్ ఇన్‌ఫరెన్సెస్ పర్ సెకండ్) ఫజ్జీ సమస్యలను సాధించేటప్పుడు ఈ ప్రత్యేక చిప్‌లు సాంప్రదాయక ప్రాసెసర్ల వేగం కంటె 10,000 రెట్లు అధికంగా ఉంటుంది. ఇటువంటి 'ఫజ్జీ చిప్'లు వ్యావహారికంగా వాడుకలోకి వచ్చినప్పుడు ఫజ్జీ లాజిక్ ఉపయోగం విస్తృతమవుతుంది.

ఫజ్జీ లాజిక్‌లో ఉజ్జాయింపులు ఉండవు. అంతా కచ్చితంగా ఉంటాయి. అంటే అస్పష్టంగా, సందిగ్ధంగా చెప్పే ఉజ్జాయింపులను అతి కచ్చితంగా చెబుతుంది. ఫజ్జీ లాజిక్ సాంప్రదాయక విజ్ఞానాన్ని పూర్తిగా వేరే విధంగా గ్రహింప జేస్తుంది. ప్రపంచం దీనిని గుర్తించడానికి 20 సంవత్సరాలు పట్టింది.

-'పసిఫిక్ ఫ్రెండ్' సౌజన్యంతో

## బియ్యపు గింజమీద 515 అక్షరాలు

మైసూరులో అనంత కుమార్ అనే ఒక ఇంజనీరు ఒక బియ్యపు గింజ మీద భూతద్దం లేకుండా 515 అక్షరాలు చెక్కాడు.

## నక్కల వేట



కర్ణాటకా హాసన్ జిల్లాలో కదబనహళ్లి గ్రామంలో జనం నక్కను పట్టుకోడం చాలా మంగళప్రదమనీ, ఆ సంవత్సరం అంతా ఊళ్లో కరువులు, రోగాలు సంభవించవని విశ్వసిస్తారు. జనవరి మధ్య నక్కల వేట పండుగ చేసుకుంటారు. ఇది విష్ణు మూర్తి అవతారమైన కావేటి రంగనాథుని దివ్య ఉత్సవంగా ఆచరిస్తారు

"ఏ దశలోనున్న వాడికి అదే మహాక్లిష్టదశ అనీ, దానిని మించినది లేదనీ అనిపించడం కద్దు."

# భారతదేశపు సుప్రసిద్ధ గణితశాస్త్రవేత్త

## శ్రీనివాస రామానుజన్

తమిళనాడులో అభివృద్ధిచెందుతూన్న పట్టణం ఈరోడ్‌లో 1887 డిసెంబర్ 22న జన్మించిన శ్రీనివాస రామానుజన్ ఒక బట్టల దుకాణంలో అక్కౌంటెంట్ కుమారుడు. కుంభకోణంలోని ఉన్నత పాఠశాలలో ఇతడి


RAMANUJAN

విద్య ముగిసింది. చిన్ననాటి నుంచి ఇతడికి గణిత శాస్త్రంలో అభిరుచి ఎక్కువగా ఉండేది. లెక్కలు అంటే ఎంతో ఇష్టం, అభిలాష.

పాఠశాలలో గణిత శాస్త్రం సంబంధమైన పాఠ్య క్రమం ఇతడికి నిస్సారమని తోచి కాలేజి లైబ్రరీ నుంచి "కార్స్ సినాప్సిస్ అఫ్ ప్యూర్ మేథమిటిక్స్" వంటి పెద్ద పెద్ద గణిత శాస్త్ర పుస్తకాలను తెచ్చుకొని పైథాగరస్ మరియు యూక్లిడ్‌లతో సహా చదువుతూ మనస్సు రంజింప చేసుకొనేవాడు. 1904వ సంవత్సరంలో జూనియర్ సుబ్రమణియన్ స్కాలర్‌షిప్‌ను పొంది కుంభకోణం ప్రభుత్వ కళాశాలలో చేరాడు. ఆంగ్ల భాషలో ప్రావీణ్యత అంతగా లేకపోవడం వల్ల కాలేజీ వదలి స్వంతంగా గణిత శాస్త్రాధ్యయనం ఇంట్లోనే ప్రారంభించాడు.

రామానుజన్ 1911వ సం.లో మద్రాసు పోర్టు ట్రస్ట్‌లో నెలకు రూ. 25/- ల జీతం మీద ఒక గుమాస్తాగా ఉద్యోగంలో చేరాడు. తన ఉద్యోగాన్ని గురించి "నా బుద్ధి కుశలతను ఆరోగ్యంగా ఉంచుకోడానికి నాకు తిండి కావాలి. ఇదే నాకు మొదటి ముఖ్యం" అన్నాడు. కాని గుమాస్తాగా ఇతడి కుశాగ్ర బుద్ధి స్తంభించి పోయింది.

ఇంగ్లండ్ కేంబ్రిడ్జిలో జి.హెచ్. హార్డీతో ఉత్తర ప్రత్యుత్తరాలు నలిపి మద్రాసు యూనివర్శిటీ నుంచి ఒక స్కాలర్‌షిప్‌ను, కేంబ్రిడ్జి (ఇంగ్లండు) ట్రినిటీ కాలేజీ నుంచి ఒక గ్రాంటును సంపాదించగలిగాడు. మత సంబంధమైన అనేక కష్టాలను, ఆటంకాలను అధిగమించి 1914 ఏప్రిల్ మాసంలో ఇంగ్లండు చేరుకున్నాడు. ప్రొఫెసర్ హార్డీకి ఇది ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. సాంప్రదాయకంగా యూనివర్శిటీలో చదువు

## కష్టం లేకుండా సుఖం లేదు

*కష్టం లేకుండా అసలు సుఖం ఉండదు. కరిగించి సుత్తితో కొట్టకుండా మంచి బంగారం ఏర్పడదు. సానబెట్ట కుండా వజ్రాలు ఏర్పడవు అయిస్టర్ హృదయం నుంచి లాగితే కాని ముత్యాలు రావు వేల కొద్దీ పూవులు నలగగొట్టితే గాని ఒక ఔన్సు సెంటు రాదు ప్రేమ కూడా అంతే- కష్టాలు, బాధలు అనుభవించకుండా ఊరికే రాదు.*

"స్వలాభమను అభిప్రాయం ఒక మానసిక వ్యాధి వంటిది."

కాకుండా ఈ యువకుడు కేంబ్రిడ్జికి వచ్చాడు. గణిత శాస్త్రంలో ఇతడు సూచించిన ఫలితాలు అద్భుతంగా తర్కాన్ని అనుసరించి, అంతర్ దృష్టి లేక దివ్యదృష్టిని అనుసరించి సమీకరింప బడినవే. ప్రొఫెసర్ హార్డీ గణిత శాస్త్రంలో ఇతడికి అవసరమైన ప్రాతిపదిక విషయాలను ప్రైవేటుగా నేర్పి గొప్పవాడిగా తీర్చి దిద్దాడు. ఇంగ్లండులో ఉంటుండగా రామానుజన్ గణిత శాస్త్రమే కాకుండా వాఙ్మయంలోను, తత్త్వ శాస్త్రంలోను అపూర్వ అభిలాషను, అనక్తిని ప్రదర్శించాడు. ఆకస్మిక సంభవాలను గూర్చి ఇతడికి ఎక్కువ అభిలాష ఉండేది. గదిలో ఇతడి చుట్టూ అనేక లైబ్రరీ పుస్తకాలు, మేథమేటికల్ ఇన్‌స్ట్రుమెంట్సు చెల్లాచెదురుగా ఉండేవి. 1913లో ఇతడు ఇండియన్ మేథ మేటికల్ సొసైటీ వారి జర్నల్‌లో "స్క్వేరింగ్ ది సర్కిల్" (వృత్తాన్ని చదరం చేయడం) అనే వ్యాసం ప్రచురించాడు.

రామానుజన్ గణిత శాస్త్రంలో థియరీ ఆఫ్ నంబర్స్, థియరీ ఆఫ్ పార్టిషన్స్ మరియు థియరీ ఆఫ్ కంటిన్యూడ్ ఫ్రాక్షన్స్ అనే విషయాలను గురించి వివరించాడు. ఇతడి పరిశోధనలు ఇతడికి ఒక గొప్ప ప్రతిభను కలిగించాయి. 1918లో ఇతడు రాయల్ సొసైటీకి మరియు ట్రినిటీ ఫెలోషిప్‌కి ఎన్నుకో బడ్డాడు ఇతడు మరణించే వరకు అనేక మేథమేటికల్ జర్నల్‌లు ఇతడి వ్యాసాలు ప్రచురించాయి.

ఆరోగ్యం చెడిపోవడం వల్ల రామానుజన్ 1919లో స్వదేశానికి మరలి రావలసి వచ్చింది. ఇక్కడ తిరిగి గణిత శాస్త్రంలో ఉద్యమం ప్రారంభించాడు. కాని 1920 ఏప్రిల్ 26న ఇతడి అకాల మరణం వల్ల అర్థాంతరంగా నిలిచి పోయింది. ●

## 70% నీరు కాలుష్యం

*నేషనల్ ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ పర్యవేక్షణ ప్రకారం భారతదేశంలో లభ్యమయ్యే 70% నీరు కాలుష్యం చెందుతూంది. మానవ నివాస ప్రదేశాలనుండి సాముదాయక మురికి నీరు, పారిశ్రామిక కాలుష్యాల కంటే 5 రెట్లు అధికం. ఈ మురికి నీరు శుభ్రపరచకుండా మంచి నీటిలో చేర్పబడుతూంది. భారతదేశంలో ఉన్న మొత్తం 3,119 నగరాలు, పట్టణాలలో 217కి మాత్రమే పాక్షికంగానో లేక పూర్తిగానో మురికి నీటిని శుద్ధీకరణ చేసే సౌకర్యాలు ఉన్నాయి*

—('యోజనా' సౌజన్యంతో)

## కాలనియమం పాటించడానికి




*ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత అలెగ్జాండర్ డ్యూమాస్‌కి నిద్రపోవడానికే తీరిక ఉండేది కాదు. ఇతడు 1,200 సంపుటాలు నింపడానికి కావలసిన మాటలు వాడాడు వైద్యుని ఆదేశం ప్రకారం పారిస్‌లో ఆర్క్ డి ట్రియంఫేలో అతడు ప్రతీరోజూ ఉదయం 7 గంటలకు ఒక ఆపిల్ పండు తినేవాడు. ఈ విధంగా చేస్తే కాలనియమంగా పడుకున్న, నిద్ర లేవడానికి వీలు అవుతుందని ఇతడి వైద్యుడు ఆశించాడు.*

సర్వాత్మ భావం కలిగినప్పుడు స్వీయరక్షణ, పరనింద అనేవి ఉండవు."

# యజమాని సేవక సంబంధం

సుప్రసిద్ధ నవలా కారుడు మరియు సైన్స్ ఫిక్షన్ రచయిత హెచ్.జి.వెల్స్ ఒకసారి తన స్నేహితునితో "ఇదే నా పడక గది. ఇక్కడ ఒళ్ళు మరచి నిద్ర పోతాను" అన్నాడు. స్నేహితుడు కలవరపడ్డాడు.

అది చూచి వెల్స్ "ఎందుకు మనసులో చింత పడుతూన్నట్టు కనిపిస్తున్నావు" అన్నాడు.

"నాకు ఒక విషయం అసలు అర్థం కావటం లేదు".

"ఏమిటది?"

"క్రింద రెండు పెద్ద పెద్ద గదులు అలంక రింపబడి ఉన్నాయి వాటిలో ఒకటి నీవు పడక గదిగా ఉపయోగించుకోవచ్చే."

"వాటిలో ఒకటి వంట ఆవిడకి, రెండోది పని మనిషికి వాళ్ళిద్దరు గత 20 ఏళ్లనుంచి విశ్వాసంతో నాకు పని చేస్తున్నారు. వాళ్లకి అవి తగినవి."

"నీకు తెలియదా వెల్స్, ప్రతి చోటా పని చేసేవారికి అంత అంత పెద్ద గదులు ఉండవని, వారికి చిన్న చిన్న గదులు మాత్రమే ఉంటాయి"

"అవచ్చు. అనేక సంవత్సరాల ముందు మేము చాలా పేదవాళ్లం. మేము ఒక ధనవంతుని పెద్ద భవనంలో నివసించే వాళ్లం. మా తల్లి అక్కడ పని చేసేది. యజమాని మాకు ఒక చిన్న చీకటి కొట్టు ఇచ్చాడు" అంటూ వెల్స్ కాస్త ఆగాడు. "నాకింకా జ్ఞాపకం. మా అమ్మ పని మనిషిగా ఉన్నప్పుడు యజమాని ఏం పట్టించుకొనే వాడు కాదు. దుమ్ముతో ఉండి బూజు కట్టుకు పోయిన ఆ చీకటి గది ఇంకా నాకు జ్ఞాపకం ఉంది. కాబట్టి నా సేవకులు, పనివాళ్లు సౌకర్యంగా జీవించాలి అని నేను నిర్ణయించుకున్నాను. వాళ్లూ మానవమాత్రులే. అణకువగా ఉంటారు. ఏ అపాయం కలిగించరు. మర్యాదతో, మమతతో ఉంటారు. అందరి కంటే వాళ్ళు ఎంతో మంచి వారు."

-('శ్రీ సత్యసాయి బాలవికాస్' సౌజన్యంతో)

## చింత చేసే అపకారం



చింతవల్ల కడుపులో పుళ్ళు బయటుదేరతాయి. జఠర అజీర్ణ రోగాలు వస్తాయి. సాధారణంగా జఠర రసంలో ఉండే కొన్ని ఆమ్లాలు ఘనం తినే ఆహారాన్ని జీర్ణింప జేయడానికి సహకరిస్తాయి. జఠర కోశపు గోడని నున్నని పొర (Mucous Lining) ఈ ఆమ్లరసాల నుండి రక్షిస్తుంది. దీర్ఘ కాలపు వ్యాకులత, చింత వల్ల జఠర రసాలు అధికంగా స్రవింపబడతాయి. ఇవి మ్యూకస్ రక్షక పొరను శిథిల పరచి జఠరకోశపు గోడలపై పుళ్లు కలిగిస్తాయి.

"కర్మ చేతను, గుణం చేతను వ్యక్తి నిజమైన మనిషి అవుతాడు, అతడే గౌరవపాత్రుడు."

# ఫ్లారెన్స్ నైటింగేల్

ఎల్. హేమమాలిని

ఫ్లారెన్స్ నైటింగేల్ ఇంగ్లండు హాంప్‌షైర్‌లో ఒక గొప్ప ధనవంతులైన జమీందారు కుమార్తె. ఈమె ఇటాలియన్ సిటీ ఫ్లారెన్స్‌లో 1820 మే 12న జన్మించింది. వివిధ విషయాలు చదువుకుంది. గ్రీకు మరియు లాటిన్ వంటి భాషలే గాక సంగీతం, కుట్టుపని కూడా నేర్చుకుంది.



ఆ రోజులలో నర్సింగ్ వృత్తిని చాలా హీనంగా పరిగణించేవారు. పెద్ద పెద్ద కుటుంబాల వారు ఈ వృత్తిని తమ గౌరవానికి భంగం అనుకునేవారు. కాని ఫ్లారెన్స్ నర్సింగ్ అన్నా, పబ్లిక్‌హెల్త్ అన్నా చాలా ఇష్టపడేది. కుటుంబంలో చాలా మంది తగదని ఒప్పుకోకపోయినా ఆమె నర్సింగ్‌ను ఒక వృత్తిగా స్వీకరించింది. 1851-52 సంవత్సరాలలో ఈమె ఫ్రాన్స్‌లో పారిస్ కాన్వెంట్‌లోను మరియు జర్మనీ కెయిసరర్‌స్వెర్త్‌లోను నర్సు వృత్తికి కావలసిన శిక్షణను తీసుకుంది. అంతేగాక ఆమె దేశంలోను, విదేశాలలోను అనేక హాస్పిటళ్ళను సందర్శించింది.

1853వ సం.లో ఫ్లారెన్స్ లండన్ నగరంలో హార్లె స్ట్రీట్‌లో ఉన్న హాస్పిటల్ ఫర్ ఇన్‌వాలిడ్ జంటిల్ ఉమెన్‌కి సూపరింటెండెంటుగా నియమింపబడింది. ఆ సమయంలో ఇంగ్లండు జారిస్టు రష్యాతో యుద్ధం ప్రారంభించింది. క్రిమియాలో (బ్లాక్ సీ) గాయాలు పొందిన వారికి, రోగులకు తగిన చికిత్స చేయడానికి వైద్యులు, నర్సులు లేరు 1854 అక్టోబర్ 21న ఫ్లారెన్స్ తన కూడా 38 నర్సులను వెంట పెట్టుకొని గాయపడిన సైనికులకు చికిత్స చేయడానికి క్రిమియాకు వెళ్ళింది

ఇక్కడ బారక్ హాస్పిటళ్ళలో అనారోగ్య పరిస్థితులవల్ల గాయపడ్డ వారికంటె అధికంగా అంటు రోగాల వల్ల మరణిస్తున్నారని తెలుసుకుంది. నిస్సహాయత ఎదురైనా ధైర్యంతో పోరాడి మంచి సమర్థవంతమైన నర్సింగ్ సర్వీస్‌ను తయారు చేసింది

## ప్రపంచ రికార్డు

### ఆరు ప్రపంచ రికార్డులు

*మెల్‌బోర్న్ (ఆస్ట్రేలియా) నుంచి బయలుదేరి సోవియట్ యూనియన్ వారి ఆన్‌టోనోవ్ 124 విమానం, 72.5 గంటలలో ఉత్తర, దక్షిణ రెండు ధృవాల మీదుగా చేసిన వరల్డ్ ఫ్లైట్‌లో ఆరు ప్రపంచ రికార్డులను స్థాపించింది. ఈ విమానం సగటున 12,500 మీటర్ల ఎత్తుగా గంటకు 820 కిలోమీటర్ల వేగంతో ప్రపంచం అంతా ఒక ధృవం నుంచి ఇంకో ధృవానికి, భూమధ్య రేఖనుంచి ఉత్తర ధృవానికి, ఉత్తర ధృవం నుంచి భూమధ్య రేఖకు, భూమధ్య రేఖ నుంచి దక్షిణ ధృవానికి, దక్షిణ ధృవం నుంచి భూమధ్య రేఖకు ఎగిరింది*

"ప్రార్థన చేసే పెదవులకన్న, సాయం చేసే చేతులే పవిత్రం."

క్రిమియా మిలటరీ హాస్పిటళ్ళలో అశుభ్రత ప్రబలిపోయింది. స్కూటారి మిలటరీ హాస్పిటల్‌ను శుభ్రం చేయించింది. సైనికులకు కావలసిన యూనిఫారం సప్లై చేయించింది. అదనంగా టర్కీలో ఒక ఇంట్లో వంట గదులు ఏర్పాటు చేయించింది. ఇక్కడ అపాయ స్థితిలో ఉన్న రోగులకు ప్రత్యేకంగా నర్సులే ఆహారం తయారు చేసేవారు. ఫ్లారెన్స్ అప్పుడప్పుడు తన స్వంత డబ్బు ఖర్చు చేసి గాయపడిన సైనికులకు తగిన వైద్య చికిత్స, సహాయం కలిగించేది. అత్యధిక ప్రమాణాలలో నర్సింగ్ సేవలు కలిగించడం వల్ల మరణాల సంఖ్య బాగా తగ్గిపోయింది. విశ్రమించకుండా ఆమె చేసే నర్సింగ్ సూపర్‌విషన్‌కి ఆమెను 'లేడీ విత్ ది లాంప్'' అని పిలిచేవారు.

సైనికులు ఆమెలో అతి సుకుమారమైన స్వభావాన్ని గ్రహించారు. గంటల కొద్దీ సైనికుల గాయాలను శుభ్రం చేసి కట్లు కట్టేది. కలరా, టైఫస్ వంటి అంటువ్యాధులు పట్టుకుంటాయనే భయం లేకుండా అందరికీ ఆమె సేవ చేసేది.

ఫ్లారెన్స్ క్రిమియాలో బాలక్ లావా అనే మిలిటరీ హాస్పిటల్‌కి వెళ్లింది. ఇక్కడ ఈమెకు తీవ్రంగా క్రిమియన్ జ్వరం వచ్చింది. సైనికులు అందరూ ఆమె శీఘ్రంగా కోలుకోవాలని ప్రార్థించారు. ఆమెకు ఆరోగ్యం చేకూరిందని విని వారికి ఎంతో సంతోషం కలిగింది. సైనికుల జీవితం బాగుపడాలని ఆమె ఆశించింది. తమ దగ్గర ఉన్న సొమ్మును ఇంటికి పంపమని ఆమె సైనికులకు చెప్పింది. ఈమె సౌజన్యత, గొప్పతనం ఇంగ్లండు అంతా పాకిపోయింది.

1856 ఏప్రిల్‌లో ఫ్లారెన్స్ నైటింగేల్ ఇంగ్లండులో బిర్తాల్‌కు వెళ్లింది. అక్కడ విక్టోరియా మహారాణి మరియు ప్రిన్స్ కాన్సార్ట్ ఆల్బర్ట్ ముందు బ్రిటిష్ మిలటరీ హాస్పిటల్ విధానం లోపాలను గురించి వివరించి చెప్పింది చేపట్ట వలసిన మార్పులు సూచించింది. 1859 వ సం.లో "నోట్స్ ఆన్ హాస్పిటల్స్" మరియు "నోట్స్ ఆన్ నర్సింగ్'' అనే రెండు పుస్తకాలు ఈమె రచించింది. వైద్యరంగంలో వాటికి ఎంతో ప్రచారం కలిగింది. 50,000 పౌండ్ల చందాలు వసూలు చేసి 1861 లో ఈమె లండనులో సెంట్ థామస్ హాస్పిటల్‌లో నర్స్ ట్రెయినింగ్ స్కూలు ఏర్పాటు చేసింది. నర్సులకు యూనిఫారం మరియు వారికి పోటీపరీక్షలు పెట్టింది. దాంతో నర్సింగ్ వృత్తికి సమాజంలో ఒక క్రొత్త గౌరవం, మర్యాద ఏర్పడింది.

## గాయాలవల్ల ఏర్పడే మరణాలు



ప్రపంచం మొత్తం మీద సాలీనా గాయాల వల్ల 3 మిలియను మరణాలు సంభవిస్తున్నాయని అంచనా వేయబడింది. ఇంకా కొంతమంది శాశ్వతంగా వికలాంగులై పోతున్నారు. ఇక తీవ్రంగా గాయపడేవారు దీనికి పదిరెట్లు అంటే ఆశ్చర్యం లేదు.

'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో

"నమ్మకం, విశ్వాసం లోపించిన జీవితం నిరుపయోగం."

1859లో లార్డ్ స్టాన్‌లీ నియమించిన రాయల్ కమిషన్ వల్ల 19వ శతాబ్దం రెండవ అర్ధదశలో భారతదేశంలో ఆరోగ్య పరిస్థితులు బాగా మెరుగు పడ్డాయి. ఈ కమిషన్ రిపోర్టు ఫ్లారెన్స్ నైటింగేల్ వ్రాసింది భారతదేశంలో అనేక మందిని సందర్శించి ప్రతివారిని గురించి వివరంగా నోట్సు తయారు చేసి భారతదేశం జీవిత విధానాన్ని వ్రాసింది ఆమె సలహాలు కోసం, అభిప్రాయాల కోసం ఎంతో మంది వ్రాసేవారు

1867వ సం.లో ఫ్రెంచ్ రెడ్ క్రాస్ సొసైటీ ఫ్లారెన్స్ నైటింగేల్‌కి ఒక స్వర్ణ పతకాన్ని ఇచ్చి గౌరవించారు. మూడు సంవత్సరాల తరువాత గాయపడిన సైనికుల సహాయానికి ఆస్ట్రియన్ పేట్రియాటిక్ సొసైటీకి ఈమెను గౌరవ సభ్యురాలుగా ఎన్నుకున్నారు. రెడ్ క్రాస్ సొసైటీని స్థాపించిన డా. హెన్రీ డ్యూనాంట్ క్రిమియాలో ఈమె చేసిన ప్రజాసేవ తనకు స్ఫూర్తిని కలిగించిందని చెప్పారు 1907వ సంవత్సరంలో ఇంటర్‌నేషనల్ రెడ్ క్రాస్ స్థాపకురాలిగా గౌరవింపబడింది.

1907 నవంబరులో ఫ్లారెన్స్ నైటింగేల్ 87వ సంవత్సరం వయస్సులో 7వ ఎడ్వర్డు చక్రవర్తి నుంచి ఆర్డర్ ఆఫ్ మెరిట్ సన్మానాన్ని పొందింది. 1910వ సం లో యునైటెడ్ స్టేట్స్ ఈమె పరోపకార జీవితాన్ని గ్రహించి మెచ్చుకుంది.

1896 నుంచి అనారోగ్యం పట్టుకొని ఇంటి పట్టునే ఉండవలసి వచ్చింది. అనేక ఆధ్యాత్మిక గ్రంథాలను చదివేది. వృద్ధాప్యం వచ్చింది. నీరసించిపోయింది. శక్తులు క్రమక్రమంగా తగ్గిపోయాయి. 1910 ఆగష్టు 13వ తేదిన నిద్రలో మరణించింది. అప్పటికి ఆమెకు 90 సంవత్సరాలు వయస్సు దాటింది. హాంప్‌షైర్‌లో కుటుంబానికి సంబంధించిన స్మశానంలో భూస్థాపితం చేయబడింది.

## స్వేచ్ఛను నిరాకరించలేం

స్వేచ్ఛను ఎన్నటికీ నిరాకరించలేం. ప్రాణులన్నిటికీ స్వేచ్ఛ అనేది ఆత్మకు చెందినది. చిన్న అడవి ఎలుక కూడా చీకటిలో ఉండకుండా వెలుతురు కోసం మార్గం త్రవ్వుకుంటుంది. సాధించి కాంతి కలిగించుకుంటుంది.

## మొట్టమొదట గొడుగు ఇంగ్లండులో ప్రత్యక్షమైంది



*ప్రాచీనకాలంలో ఈజిప్టు మరియు గ్రీసు దేశాలలో ఎండ వేడి తగులకుండా గొడుగులు ఉపయోగించేవారు. ఇవే ఆసియాలో రాజమర్యాదను, ధనికుల గౌరవాన్ని సూచించేవి. ప్రాచీన దేశాలలో పెద్ద పెద్ద రంగుల గొడుగులు ఉపయోగించేవారు. మొట్టమొదట 17 వ. శతాబ్దంలో ఇంగ్లండులో గొడుగు ప్రత్యక్షమైంది. ఆ తరువాత 100 సంవత్సరాలకు జోనాస్ హానేవే అనే ప్రయాణీకుడు ప్రతీరోజూ గొడుగు తీసుకు వెళ్లడం అభ్యాసం చేసాడు.*

"పెన్నిధి గల వారికేం తెలుస్తుంది పేదల బ్రతుకు?"

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. ధ్వని తీవ్రతను కొలిచే ప్రమాణం:
(ఎ) నాట్ (knot), (బి) కెలోరీ (calorie), (సి) ఓమ్ (ohm), (డి) జౌల్ (Joule), (ఇ) డెసిబెల్ (Decibel)

2 క్రింది వాటిలో ఏ శక్తి నాన్-కన్వెన్షనల్‌గా (Non-Conventional)గా గ్రహించబడుతుంది?
(ఎ) సౌర (Solar), (బి) న్యూక్లియర్ శక్తి (సి) బొగ్గు, (డి) సహజ వాయువు (Natural gas), (ఇ) పెట్రోలియం.

3 'ఆగాఖాన్ కప్' ఏ క్రీడకు సంబంధించినది?
(ఎ) బాడ్మింటన్, (బి) హాకీ, (సి) టెన్నిస్, (డి) గోల్ఫ్, (ఇ) క్రికెట్.

4 భారతదేశంలో 'నవసేవ' (Nhava Sheva) ఓడరేవు ఎక్కడ ఉంది?
(ఎ) తూర్పు, (బి) పశ్చిమం, (సి) ఉత్తరం, (డి) దక్షిణం.

5. భారతదేశంలో దశాంశ నాణాల (Decimal Coinage) ఉపయోగం ఏ సంవత్సరంలో ప్రారంభమైంది?
(ఎ) 1948, (బి) 1950, (సి) 1957, (డి) 1962.

6. బట్టల తరువాత భారతదేశపు రెండవ ముఖ్య పరిశ్రమ:
(ఎ) సిమెంట్, (బి) పంచదార, (సి) జూటు, (డి) ఇవి ఏవీ కావు.

7. 'సిల్లీ పాయింటు' దేనికి సంబంధించినది?
(ఎ) క్రికెట్, (బి) ఫుట్‌బాల్, (సి) బాడ్మింటన్, (డి) చెస్.

8. 1921లో మోప్లా తిరుగుబాటు జరిగింది ఎక్కడ?
(ఎ) కాశ్మీర్, (బి) అస్సాం, (సి) కేరళ, (డి) బీహార్.

## మాటల మహిమ

1. మిట్టిపడు. (ఎ) ఎగిరిపడు, (బి) ఉలికిపడు, (సి) ఎగసిపడు, (డి) పరితాపము.

## కోపం వచ్చినప్పుడు శరీరంలో జరిగే మార్పు



*బాగా కోపంతో రేగిపోయి వగబట్టినప్పుడు శరీరంలో వింత వింత మార్పులు ఎన్నో సంభవిస్తాయి. కోపం వచ్చిన ఒక్క క్షణంలో రెండు సెల్లుల ఫ్లాష్ బల్బ్ మూడు నెలలు వెలగడానికి పట్టేటంత విద్యుచ్ఛక్తి వినియోగమవుతుంది. కాబట్టి వైజ్ఞానికంగా, వైద్యశీయంగా జరిపిన పరిశోధనలు అనురాగంతో ప్రేమించమని చెబుతున్నాయి. అనురాగం అనేది నీవు కలిగించుకుని, ఇతరులతో పంచుకోవాలి.*

"వేళ మించిన నిర్ణయం చేయి జారిన అవకాశం."

2. మన్నన: (ఎ) గౌరవము, (బి) ఆదరము, (సి) దయ, (డి) అనుగ్రహము.
3. మురువు: (ఎ) సౌందర్యము, (బి) విలాసము, (సి) కాంతి, (డి) మురుగు.
4 రొద: (ఎ) ధ్వని, (బి) చింత, (సి) అరచు, (డి) కూయు.
5. లావు: (ఎ) బలము, (బి) సామర్థ్యము, (సి) ధైర్యము, (డి) సాహసము.
6. లాస్యము: (ఎ) నృత్యము, (బి) ముఖము, (సి) కోపము, (డి) ఔత్సుకము.
7. మనువు: (ఎ) జీవనము, (బి) వృత్తి, (సి) నడత, (డి) కాపురము.
8. మట్టము: (ఎ) సమానము, (బి) పొట్టిది, (సి) అల్పము, (డి) అధమము

## తెలివికి పరీక్ష

1 ఈ వరుసలో తరువాత సంఖ్య ఏది? 3 7 13 21 31 43 —?

2 తింటేగాని రుచి తెలియదంటారు. మరి లోతు తెలియాల్నంటే?

3. ఇంట చేరిన కుక్క తిండికోసం పాత్రలను వెతికితే గర్భగుడిలో ప్రవేశించిన దొంగ ఏం చేస్తాడు?

4. "పా క బ్ర డి న ద గి ము హ్మా"లో చెదరిన అక్షరాలను క్రమంగా వ్రాస్తే సుప్రసిద్ధ కీర్తన పల్లవిలో ఒక పాదం అవుతుంది - ఏమిటది?

5. దురవస్థలో ఇద్దరుంటే దుఃఖం రెట్టింపు అవుతుంది. నిజమేనా?

6. తనకు లేదని కాక ఇతరులకు ఉన్నదని ఏడ్చేవారు ఎవరు?

(జవాబులకు —వ పేజీ చూడండి)

## కొబ్బరినీళ్ళ పౌష్టికత

కొబ్బరి నీళ్లు చాలా పుష్టికరం అని ఎంతో మందికి తెలియదు. ప్రొటీనులు, ఆర్గానిక్ ఆసిడులు పంచదార, విటమినులు, పొటాషియం, రాగి, మెగ్నీషియం వంటి ఖనిజాలు కొబ్బరి నీళ్ళలో అధికంగా లభిస్తాయి రోగులకు, ఆరోగ్యవంతులకు కూడా కొబ్బరి నీళ్లు అలసట తీర్చి హాయిని కలిగిస్తాయి

## భారతదేశంలో 207 సాంక్చురీలు



భారతదేశంలో 207 సాంక్చురీలు మరియు 45 నేషనల్ పార్కులు దేశం మొత్తం వైశాల్యంలో 2.7% ప్రదేశం ఆవరించి ఉన్నాయి. సాంక్చురీలు 0.61 నుండి 7818 కిలోమీటర్లు, నేషనల్ పార్కులు 0.04 నుండి 3162 కి.మీ.ల పరిమాణంలో ఉన్నాయి. సాంక్చురీలలో సామాన్యంగా వివిధ జాతులు (సిట్రస్ పిచ్చర్‌ప్లాంట్, గ్రేట్ ఇండియన్ బస్టర్డ్)లకు, నేషనల్ పార్కులలో పులి, సింహం, రైనోవంటి ప్రత్యేక అడవిజంతువులకు, మృగాలకు సహజ వాతావరణం ఏర్పాటు చేయబడి ఉంటుంది.

(యోజనా సౌజన్యంతో)

"సిరిని అందరూ కోరుకున్నా, అది కోరనివానినే వరిస్తుంది."

# వనితాలోకం

## ఇంటి సలహాలు

● సెలోఫేన్ టేప్ చుట్ట చివర అంటుకుపోతే: సెలోఫేన్ చుట్టను 10 నిమిషాల పాటు మీ ఫ్రిడ్జిలోపెట్టి ఉంచండి. అంటుకుపోయిన సెలోఫేన్ చివర విడివడి పైకి వస్తుంది.



● ఐస్ ముక్కలు శీఘ్రంగా చేయాలంటే: ట్రేలో కొన్ని ఐస్ ముక్కలు ఉంచి ట్రేని నీటితో నింపితే అందులో ఐస్ ముక్కలు నీటిని త్వరగా చల్లబరుస్తాయి. అప్పుడు కొత్త ఐస్ ముక్కలు త్వరగా ఏర్పడతాయి

● నిద్రపట్టకపోతే- రాత్రి పడుకునే ముందు పంచదార కలిపిన వెచ్చని పాలు త్రాగి పడు కుంటే బాగా నిద్రపడుతుంది.

● చర్మం మృదువుగా ఉండాలంటే: తర్బూజా రసం ముఖానికి పట్టించుకో.

● పళ్లు తెల్లగా ఉండాలంటే: చిటికెడు సోడా ఉప్పు (baking soda) లేక మామూలు ఉప్పుతో పళ్ళు బ్రష్ చేసి తోముకో.

● తలలో చుండ్రు పోయి వెంట్రుకల కుదుళ్ళు గట్టిపడి నల్లగా ఉండాలంటే: -తలకు నూనె పట్టించిన తరువాత నిమ్మకాయరసం తల చర్మానికి బాగా పట్టించి, మర్దనా చేసి 15-20 నిమిషాల పాటు అలాగే ఉంచి తరువాత కడిగేసుకో.

● బియ్యంలో పురుగు చేరకుండా ఉండాలంటే: బియ్యం డబ్బాలో పోసి నిల్వ చేసేముందు ఎండిన వేప ఆకులు డబ్బాలో అడుగున పెట్టు.

● వాడిన పూలు లేవాలంటే: పువ్వుల మొక్కలకు ఆస్ప్రిన్ కలిపిన నీళ్లు పోయాలి

## వైద్యుడికి నీకంటే అధికంగా తెలుసు

పూర్వం రెండు దేశాలు సార్వభౌమాధికారానికి వరస్పరం పోరాడుకుంటున్నాయి. యుద్ధ సమయంలో కొందరు వైద్యులు గాయపడిన సైని కులకు చికిత్స చేస్తున్నారు. మరణించిన సైనికుల తలమీద "మరణించాడు" అని వ్రాస్తున్నారు. ఊడ్చే వాళ్లు వాళ్ళని స్మశానానికి తీసుకుపోతున్నారు. పొరపాటున ఒక వైద్యుడు గాయపడిన సైనికుని తలమిద "మరణించాడు" అని వ్రాసాడు అతడిని స్మశానానికి తీసుకు పోతుండగా కెవ్వు మని "నన్ను ఇక్కడే వదిలేయండి, నేను ఇంకా బ్రతికే ఉన్నాను" అని అరిచాడు. వెంటనే ఊడ్చే వాడు "నోరు మూసుకో, వైద్యునికంటె నీకు ఎక్కువ తెలుసా? ఏమైనా సరే నిన్ను పూడ్చి పెట్టాలి" అన్నాడు.

-ఎ.కె. త్రిపాఠి, బోనామ్ కలా (ఒరిస్సా)

"నీ మీద నీకు గాఢ నమ్మకం, భగవంతుని మీద అచంచల విశ్వాసం ఉన్నప్పుడే ఘనకార్యాలను సాధించవచ్చు."

● ఎర్రచీమ కుడితే. మంట తగ్గడానికి ఉప్పు కలిపిన వెచ్చని నీటితో కడుక్కో.

● బట్టలమీద మరకలు పోవాలంటే: రెండు పచ్చి టొమోటాల రసంలో చిన్న గుడ్డ ముంచి దానితో రుద్దు.

● బట్టలు ఆరపెట్టే తాడు చాలా రోజులు మన్నడానికి: ఉపయోగించే ముందు త్రాటిని సోపు నీళ్ళలో వేసి కొద్ది నిముషాలపాటు మరగబెట్టు

● షర్టు కాలర్ల దగ్గర, చెతి కఫ్‌ల వద్ద మురికిపోవడానికి: ఉతకడానికి ముందు రోజు రాత్రి మురికి పట్టిన చోట టాల్కం పౌడరు బాగా చల్లి రాసి ఉంచు. మర్నాడు ప్రొద్దున్న మామూలుగా ఉతుకు. అతి సులభంగా మురికి పోతుంది.

● మేకు దిగ గొట్టేటప్పుడు పై ప్లాస్టర్ పగల కుండా ఉండడానికి. మేకు దింపే చోట సెలోఫేన్ టేప్ క్రాస్ రూపంలో గోడ మీద అతికించు.

● నడలిన ఫర్నిచర్ బిగిపొందాలంటే వదులుగా క్రుంగిపోయిన ఫర్నిచర్‌ను సబ్బు నీటితో కడిగి ఉప్పు నీటిలో శుభ్రం చేసి ఎండలో ఆరబెట్టు.

● పిల్లల జుట్టుకి అంటుకు పోయిన చూయింగ్ గమ్ తీయాలంటే. కొద్దిగా కొబ్బరి నూనెలో ముంచిన గుడ్డతో తుడిస్తె చాలు.

● కట్‌ఫ్లవర్స్ దీర్ఘకాలం మన్నాలంటే: ఒక చెంచాడు బొగ్గు పొడి కలిపిన నీటిలో వాటిని ఉంచు.

● రుచికరమైన కట్‌లెట్స్ తయారు చేయడానికి మిగిలిపోయిన అన్నం, బంగాళాదుంప, ఉల్లిపాయ, సాసు, సోపు సామానులు, ఒక గుడ్డు లేక శనగపిండి కలిపి బాగా ముద్దగా చేసి నూనెలో వేయించు

('కాస్మోన్యూస్' సౌజన్యంతో)

## ఒకే ఒక గంట జీవితం

*ఏళ్ల తరబడి నీచమైన అనౌచిత్యాలతో గౌరవ మర్యాదలు లేకుండా మురికి నీటి గుంటలలో నీరు వంటి జీవితాల కంటె తీరిక లేకుండా సుప్రసిద్ధ కార్యకలాపాలతోను, గౌరవ ప్రదమైన తెగింపుతోను, పేరు ప్రతిష్ఠలతోను నిండిన ఒకే ఒక గంట జీవితం అమూల్యమైనది, పవిత్రమైనది*

— సర్ వాల్టర్ స్కాట్

## ప్రపంచంలో మిక్కిలి అందమైన నగరాలు



*న్యూయార్క్, (యు.ఎస్.ఎ.), లండన్ (ఇంగ్లండ్), వెనిస్ (ఇటలీ), కెయిరో (ఈజిప్టు), ఇస్తాంబుల్ (టర్కీ), రియో డి జనిరో (బ్రెజిల్), చికాగో (యు.ఎస్.ఎ.), ఢిల్లీ (ఇండియా), పారిస్ (ఫ్రాన్స్), బీరుట్ (లెబనాన్).*

"గుడ్డి నమ్మకం సమాజానికి సంస్కారవంతం కాదు."

# కాబేజి - అద్భుతమైన ఆకుకూర

భువన్ మోహన్

కాబెజ'ని హిందీలో పట్టా గోబి అంటారు. అపూర్వమైన ఔషధ లక్షణాలుగల కాబేజికి మన కాయగూరలలో ఒక ప్రత్యేక స్థానం ఉంది

ఒక తాజా కాబేజిలో 90 2 శాతం నీరు, 1 8 శాతం మాంసకృత్తులు, 6 3 శాతం కార్బొహైడ్రేటులు, 0 1 శాతం క్రొవ్వు పదార్థాలు,



0 6 శాతం ఖనిజాలు, 0 03 శాతం సున్నం, 0 05 శాతం భాస్వరం ఉండగా, ప్రతి 100 గ్రాముల కాబేజిలోను 2000 'IU' విటమిను 'A', 60 మైక్రో గ్రాముల విటమిను 'B', 0 04 మి గ్రాల నియాసిన్, 124 mg విటమిను 'C' లభిస్తున్నాయి.

దీన్ని సామాన్యంగా అజీర్ణ రోగాలు, గుండె వ్యాధులు, మలబద్ధత, దీర్ఘకాలపు దగ్గులు, జ్వరాలు, కడుపు ఉబ్బరం, మూత్ర సంబంధమైన వ్యాధులు మొదలైన వాటిని నివారించుకోడానికి వాడతారు. గర్భిణీ స్త్రీలు అనేక రోగాలకు దీనిని ఔషధంగా ఉపయోగిస్తారు.

సామాన్యంగా పెద్దవారికి ప్రతిదినం అవసరమైన విటమిను 'C' 250 గ్రాములు కాబేజి నుండి లభిస్తుందని నిపుణుల అభిప్రాయం. దీంట్లో ఇనుము అత్యధికంగా ఉంది కాబట్టి గర్భిణీ స్త్రీలు దీనిని విస్తారంగా వివిధ రోగాల నివారణకు వాడవచ్చు రక్తహీనతతో బాధపడేవారు రక్తపుష్టికి దీనిని ఉపయోగించవచ్చు.

చక్కెర మరియు ఇతర పిండి పదార్థాలు క్రొవ్వుగా మారకుండా నిరోధించే టార్టారిక్ ఆసిడ్ అనే ద్రవం కాబేజిలో ఉందని ఇటీవల పరిశోధనలవల్ల తెలిసింది కాబట్టి శరీరం లావును తగ్గించుకోడానికి దీని విలువ అమూల్యం శరీరం సన్నబడటానికి తాజా కాబేజి రసం త్రాగటం కంటె సులభమైన ఔషధం ఇంకొకటి లేదు

కాలిఫోర్నియా స్టాన్‌ఫోర్డ్ స్కూల్ ఆఫ్ మెడిసన్‌లో డా గార్‌నాథ్ చానే అనే పరిశోధకుడు మరియు అతడి తోటివారు చేరి కాబేజినుంచి పుళ్ళను నివారించే (ఆంటీ అల్సర్) విటమిను 'U'ను వేరు చేసారు ఇది ముఖ్యంగా కడుపులో పెప్టిక్ అల్సర్‌ను మాన్పడానికి అమూల్యమైనది కాబేజీని అధికంగా వేడి చేయటం వల్ల, ఉడకబెట్టటంవల్ల దీని పుండ్ల నివారకగుణం నశించిపోతుంది

కాబేజి పై ఆకుపచ్చని ఆకులలో విటమిను 'A' విస్తారంగా ఉంటుంది ఇది అంతగా లోపలి ఆకులలో ఉండదు కాబట్టి పైఆకులు పారవేయకూడదు. పై ఆకుపచ్చని ఆకులలో ఇనుము శాతం కూడా అధికంగా ఉంటుంది సాధ్యమైనంత వరకు పచ్చి కాబేజి ఉపయోగించడం మంచిది వండటంవల్ల కాబేజీలో విటమినులు, పోషకాంశాలు నశించిపోతాయి.

"బిచ్చమెత్తటం కన్నా పస్తుండటం మేలు"

ఉడికించిన నీరు పారపోసినప్పుడు దీనిలో ఖనిజాలు, ఇతర విటమినులు కూడా పోతున్నాయి. తాజా పచ్చి కాబేజీ ఉపయోగించడం ఉత్తమోత్తమం.

కాబేజి రసం రక్తనాళాల గోడలపైన మచ్చలు రాకుండా చేసి వాటికి కావలసిన శక్తిని ఇస్తుంది. కాబేజి రసం ఒక్కటే తీసుకోవచ్చు. లేక ఒకటి రెండు ఇతర కాయగూరలు కారెట్, తోటకూర, బచ్చలి, కొత్తిమిరి, కరివేపాకు, బీట్‌రూట్, దోస, టమోటో, పుదినా, పొట్లకాయ మరియు టర్నిప్ మొదలైన వాటి రసాలు దీంట్లో చేర్చవచ్చు. ఉప్పుగాని ఇతర సుగంధ ద్రవ్యాలు గాని దీంట్లో కలపకూడదు. రసం తీసిన వెంటనే తాజాగా త్రాగడం మంచిది.

కాబేజీని సాధారణంగా కూరలకు, పులుసులకు ఉపయోగించేటప్పుడు దీనిని సన్నగా కోయాలి. ఇతర కాయగూరలలో కలిపి వండినప్పుడు చిన్న చిన్న ముక్కలుగా వేసి పైన పుదీనా, కొబ్బర్రి, కొత్తిమిరి మొదలైన వాటితో అలంకరించవచ్చు. లేకపోతే కాయగూరలు అన్నింటినీ కొబ్బరిలా సన్నగా తురుముకుని బాగా కలపడం కూడా మంచిదే. మొలకెత్తే పప్పు దినుసులు కూడా కలపవచ్చు. పెసలు, శనగలు, గోధుమలు, వేరు శనగ గింజలు మొదలైనవి దాంట్లో కలపవచ్చు. తియ్యగా చేసుకోవాలంటే ఖర్జూరం, ద్రాక్ష చిన్న చిన్న ముక్కలుగా కోసి కలుపుకోవచ్చు.

రష్యాలో నాటు వైద్యులు కాలిన పుళ్ళకు, గాయాలకు, మంచువల్ల ఏర్పడిన పుళ్ళకు తాజా కాబేజి ఆకులు కట్టు కడతారు. గొంతు సంబంధమైన వ్యాధులకు కాబేజి రసం నీటిలో కలిపి పుక్కిలిస్తారు. తల జుట్టు బాగా పెరగటానికి కాబేజి ఆకుల ముద్ద బాగా తలకి పట్టించాలి. కీళ్ళవాపులకు, బెణుకులకు, విరిగిన ఎముకలకు కాబేజి ఆకులు కట్టు కడతారు. కండ్ల కలకలకు, మంటలకు కాబేజి ఆకులు బాగా నలిపి కళ్ళ మీద పెట్టుకుంటారు.

—('ది లైఫ్ నాచురల్' సౌజన్యంతో)

●

## 12 మంది ప్రఖ్యాత అమెరికన్ అధ్యక్షులు

జార్జి వాషింగ్టన్, థామస్ జెఫర్సన్, అబ్రహామ్ లింకన్, థియొడర్ రూస్‌వెల్ట్, జేమ్స్ పోక్, ఆండ్రూ జాక్సన్, వుడ్రో విల్సన్, ఫ్రాంక్లిన్ రూస్‌వెల్ట్, హారీ ట్రూమన్, డ్వైట్ ఐసెనోవర్, రోనాల్డ్ రీగన్, జార్జి బుష్.

## గెలీలియోకి అనేక బాధలు కలిగించారు




*2వ పోప్ జాన్ పాల్ ప్రకారం 17వ శతాబ్దపు సుప్రసిద్ధ ఖగోళ మరియు భౌతిక శాస్త్రజ్ఞుడు అగు గెలీలియోకి రోమన్ కాథలిక్ చర్చి అధికారులు అనేక బాధలు కలిగించారు. ప్రపంచ చరిత్రనే మార్పు చేస్తాయని అతడి సిద్ధాంతాలను ఉపసంహరించుకోమని బలవంతపెట్టారు.*

"మంచిచెడులు పడుగు పేకలుగా నేసిన వస్త్రమే మన జీవితం."

# నీటిపాములు

### గీబు హెరాలు

వర్షా కాలంలో రోడ్ల మీద మనం నడిచేటప్పుడు దారిలో అడ్డుగా తరచు పాములు పాకు తూంటాయి. అప్పుడప్పుడు మన ఇండ్లలో కూడా వీటిని చూచి భయపడి కంగారుపడి పోతూంటాం. వాస్తవంగా అంత భయపడి పోవలసిన అవసరం లేదు ఈ పాములు నిరపాయకరమైన నీటి పాములై ఉండవచ్చు. ఇవి విషకారులు కావు.



శరీరంపై చారలు గల "కీల్ బాక్" ఇటు వంటిదే హిందీలో దీనిని "పానీ కా సర్ప్" లేక "డోరియా" అంటారు. గుజరాతీలో "డెండూ" అని, బెంగాలీలో "జల్ ఢోన్రా" అని అంటారు. తమిళంలో "తన్నీరు పాంబు" అనేదే మనం చెప్పుకొనే నీటి పాము. చారల 'కీల్‌బాక్'-నీటి పాములు భారతదేశంలో అన్ని ప్రదేశాలలో ముఖ్యంగా మంచి నీటి చెరువుల దగ్గర, నీటి గుంటల దగ్గర కనిపిస్తాయి. భారతదేశంలో మొత్తం 20 రకాలకు పైబడిన "కీల్‌బాక్" నీటిపాములు కనిపిస్తాయి. వాటి శరీరం మీద ప్రతి పొలుసుకి ఒక సున్నితమైన మడత ఉంటుంది. ఇది బహుశః నీటిలో వాటి సంచారానికి సహాయ పడవచ్చు. మడతల వల్లే దీనికి "కీల్‌బాక్" అని పేరు వచ్చింది. ఇవి భూతలం మీద అంత వేగంగా పాకలేవు కాని నీటిలో పడిన వెంటనే ఇవి అతివేగంగా ఈదుతాయి. లోతుగా డైవ్ కూడా చేస్తాయి

తెల్లటి శరీరం పైన నల్లటి, తెల్లటి చారలు మరియు "కీల్‌బాక్" ఉండటం వల్ల దీనిని చారల "కీల్‌బాక్" అంటారు. మధ్యరకం పరిమాణంలో చాలా లావుగా ఉండి 60 సెంటీ మీటర్లు దానికి పైబడి పొడవుగా ఉంటాయి. 1 21 మీటర్లు పొడుగు దాటి ఉండవు. సాధా రణంగా ఆడపాము మగదానికంటె ఎక్కువ పొడవుగా ఉంటుంది

చిన్న చిన్న లేతరంగు మచ్చలతో నల్లగాను లేక పసుపు పచ్చగాను ఉండే వీటి శరీరం మీద విస్పష్టంగా రెండు రకాల చారలు

## బ్రిటిష్ లక్జరీ లైనర్ అధునాతనం చేయబడింది

*సుమారు 1,850 ప్రయాణీకులకు, మరియు వెయ్యి మంది పనిచేసే వారికి 67,000 BRT బ్రిటిష్ లక్జరీ లైనర్ క్వీన్ ఎలిజబెత్ II సరి పోతుంది. ఇది 294 మీటర్ల పొడవు, 32 మీటర్ల వెడల్పుతో 10 మీటర్ల డ్రాటు (draught) కలిగి ఉంటుంది. ఇటీవల దీనిని బ్రెమెర్‌హేవెన్ లాయడ్ షిప్ యార్డ్‌లో పైనుంచి అడుగుదాకా 300 రోజుల రికార్డు కాలంలో 312 మిలియను DM వెచ్చించి అధునాతనం చేసారు*

"సదాలోచన సత్కార్యానికి దారి తీస్తుంది."

ఉంటాయి. ఒకటి కంటి క్రింద, ఇంకొకటి కంటివెనుక. తల ఓవల్‌గా కోడిగ్రుడ్డు ఆకారంలో ఉంటుంది. మెడకంటె తల స్పష్టంగా కనిపిస్తుంది. మొత్తంమీద ఇవి మెరుస్తూ మృదువుగా ఉంటాయి. క్రింది భాగం తెల్లగా ఉంటుంది

చారల నీటిపాముల రంగు వాటికి రక్షక వర్ణము. క్రింది తలం నుంచి చూచినప్పుడు తెల్లగా నీటితలంతో సమానం గాను, పైనుంచి చూచి నప్పుడు నలువు రంగు నీటితలంలోను సమంగా ఉంటుంది.

చారల "కీల్‌బాక్"లు పగలు, రాత్రి కూడా చాలా చురుకుగా తిరుగుతాయి. నీటి పాములు కాబట్టి ఇవి ముఖ్యంగా నీటి చెరువులు, గుంటలు, కాలువలు, నదులలో ఉంటాయి. రాత్రిపూట చెరువు గట్లమ్మట, వరిపొలాల గట్ల మీద ప్రాకుతూ ఆహారం సంపాదించుకుంటాయి. ఇవి చేపలు, కప్పలు, అప్పుడప్పుడు ఎలుకలు, పక్షులు మొదలైన వాటిని మ్రింగేస్తాయి.

ఆడపాములు ఎలుకల కన్నాలలోను, చీమల పుట్టలలోను, మరియు చెరువు గట్ల ప్రక్క రంధ్రాలలోను 20 మొదలు 40 గ్రుడ్లను పెడతాయి. 60 మొదలు 70 రోజులలో పెరిగే వరకు వాటిని రక్షిస్తాయి. సాధారణంగా గ్రుడ్లు పెట్టిన తరువాత పాములు వదిలేసి వెళ్లిపోతాయి. ఇది ఈ జాతికి అపూర్వ లక్షణం. భారతదేశపు ఇతర నీటిపాములు లాగే ఈ కీల్‌బాక్‌లు కూడా విషకారులు కావు. కాని వీటిని బెదిరించి కొట్టినప్పుడు, పట్టుకున్నప్పుడు కరుస్తాయి. బెదిరించినప్పుడు పడగ విప్పి త్రాచుపాములాగా పైకి లేస్తుంది. అందుకే వీటిని చూచి త్రాచుపాములని భ్రమపడతారు.

చారల కీల్‌బాక్ నీటిపాములు వరి పొలాలలో ఎలుకలు మొదలైన రోడెంటులను తినేస్తూంటాయి. ఈ విధంగా పంటకు నష్టం ఏర్పడకుండా రక్షిస్తుంది

(సి.ఇ.ఇ.-ఎన్ఎఫ్ఎస్ సౌజన్యంతో)

## ఒకే ఆశ ఉంది!




*సామాన్య ప్రజే భారతదేశపు ఆధారం దరిద్రులలో, బల హీనులైన దుర్బలులలో, రోగులలో పరమాత్ముని చూడగలవారే వాస్తవంగా దేవుణ్ణి గ్రహిస్తున్నారు. జాతి, కుల, మత బేధాలు పాటించకుండా ఒక దరిద్రుడుకి సహాయపడి సేవచేసిన వారిని చూచి దేవుడు ప్రసన్నుడు అవుతాడు పరమాత్ముని ప్రత్యక్షం చేసుకోడానికి ఎక్కడికో వెళ్ళక్కరలేదు. ఈ దరిద్ర నారాయణులు, నిస్సహాయులు, దుర్బలులు అందరూ దేవతా మూర్తులు కాదూ? ప్రప్రథమంగా వారిని ఎందుకు పూజించకూడదు? సామాన్య ప్రజలను నిర్లక్ష్యం చేయడం ఒక జాతీయ పాపంగా నేను గ్రహిస్తాను. ఇదే మన పతనానికి ముఖ్యకారణం. సామాన్య ప్రజలకు పట్టెడు అన్నం పెట్టి, వారి మంచి చెడ్డలు గ్రహించనంత వరకూ ఎటువంటి గొప్ప గొప్ప రాజకీయాలు ఎందుకూ పనికిరావు.*

"మాటలు చేసిన గాయాలు ఎప్పటికి మానవు."

# నమ్మలేని నిజాలు

## ఐసెన్‌హోవర్ తలిదండ్రులు యుద్ధానికి వ్యతిరేకం

జనరల్ డ్వైట్ ఐసెన్‌హోవర్ 1944లో జర్మనులు ఆక్రమించిన యూరప్‌లో మిత్ర సైన్యాలలో కమాండర్. ఇతడు యుద్ధం జరుగకూడదని ప్రతికూలభావం గల ఒక ధార్మిక కుటుంబంలో జన్మించాడు.

## బంగారు గనులు కనిపెట్టాడు, గర్భదరిద్రుడుగా మరణించాడు

పాట్రిక్ హన్నాన్ పశ్చిమ ఆస్ట్రేలియా కాల్‌గూర్లీలో బంగారు గనులను కనిపెట్టాడు. ఇతడు కనిపెట్టిన బంగారం వల్ల 600,000,000 డాలర్లు లభించినా ఇతడు గర్భదరిద్రుడుగా మరణించాడు

## కోకో-కోలా మొట్టమొదట ఔషధంగా వాడబడింది

మొట్టమొదట కోకో-కోలా ఔషధంగా వాడబడింది పొరపాటు వల్ల ఇందులో గాలి చేరినప్పుడు అనుకోకుండా అది మంచి పానీయంగా తయారైంది ఈనాడు 200 మిలియనుకు పైగా కోకో-కోలా సీసాలు ప్రపంచం అంతటా అమ్మబడుతున్నాయి.

## బంగాళదుంపలు ఆయుక్షీణం అనుకునేవారు

17వ శతాబ్దంలో బంగాళదుంప దక్షిణ అమెరికా నుంచి స్పానిష్ సైనికులచే యూరప్‌లో ప్రవేశ పెట్టబడింది. మొట్టమొదట ఇవి తింటే కుష్టురోగం వస్తుందని అనుకున్నారు. యూరప్‌లో కొన్ని ప్రదేశాలలో ఇది తింటే ఆయువు క్షీణిస్తుందని విశ్వసించేవారు.

## దాదాభాయ్ నౌరోజి

ఆర్.పి. మసాని


Naoroji

దాదాభాయ్ నౌరోజి విద్యార్థిదశలో తోటి విద్యార్థుల మరియు ఆచార్యుల గౌరవాన్ని పొందాడు ఇతడి యందలి మానవీయతను ఉపాధ్యాయులు గ్రహించారు. ప్రొఫెసర్ ఆర్లెబార్ భారతదేశాభివృద్ధికి తగిన విద్యార్థి అని ఇతడిని గూర్చి చెప్పాడు ఇతడి జోస్యం నిజమైంది.

ఈ "భారతదేశాభివృద్ధికి తగిన విద్యార్థి" అనేక రంగాలలో ప్రప్రథముడు అనిపించుకున్నాడు. ఇతడు మొట్టమొదటి భారతదేశపు ప్రొఫెసర్. భారత దేశపు సాంఘిక, పండిత, రాజకీయ రంగాలలో సామాన్య ప్రజల ఉద్ధరణకు మొట్ట మొదట అనేక సంస్థలు ప్రారంభించాడు. ఇతడే బ్రిటిష్ పార్లమెంట్‌లో మొట్టమొదటి భారతీయ సభ్యుడు. రాయల్ కమిషన్‌లో మొదటి భారతీయుడు. తన దేశప్రజలకు స్వరాజ్య హక్కును ప్రతిపాదించిన మొదటి భారతీయుడు.

"కళ్ళుండి చూడని వారే నిజమైన అంధులు."

# యాత్రా స్థలాలు

## తంజావూరు

అనేక దేవాలయాలతో అలరారుచున్న తంజావూరు మద్రాసుకు 351 కి.మీ.ల దూరంలో ఉంది. ఇది అనేక కళలకు, సంస్కృతులకు మరియు సాహిత్య వైవిధ్యానికి ముఖ్య కేంద్రం. ఇచ్చట 70 కి పైగా గల అద్భుత దేవాలయాల గాంభీర్యం తమిళుల ప్రాచీన



వైభవాన్ని, శిల్పచాతుర్యాన్ని చాటుతూంటాయి. 10 మరియు 14 శతాబ్దాల మధ్య అభివృద్ధి చెందిన చోళ సామ్రాజ్యానికి తంజావూరు ముఖ్యపట్టణము.

మొట్టమొదట దీనికి 'అలకా' నగరం అని పేరు. తరువాత తంజన్ అనే రాక్షసుడు శరణార్థిగా ఇక్కడికి వచ్చాడు. శ్రీ మహావిష్ణువు ఈ రాక్షసుని సంహరించాడు. ఆ రాక్షసుడు మరణించే ముందు అతడి కోరిక ప్రకారం ఆ నగరానికి తంజావూరు అని పేరు పెట్టబడింది. ఇచ్చటి బృహదీశ్వరాలయంలో స్వామి బృహదీశ్వరుడు. అమ్మవారు బృహన్నాయకి. దక్షిణ భారత దేశపు చరిత్రలో ముఖ్య పాత్రను వహించిన చోళ చక్రవర్తుల మహోన్నత వైభవాన్ని ప్రకటిస్తుంది ఈ ఆలయం.

ఈ బ్రహ్మాండమైన దేవాలయాన్ని రాజరాజ చోళుడు (895-1016 AD) రాజ్యంలో నిపుణులైన శిల్పులచే కట్టించాడు. ఈ దేవాలయంలో పెద్ద లింగం ఒకటి ఉంది. ద్రావిడ సాంప్రదాయానుసారంగా నిర్మించబడిన గోపురం 66 మీటర్ల ఎత్తుగా ఉంటుంది. గర్భగుడి పైగల గోపురం 81 టన్నుల భారం తూగే నల్ల రాతిమీద ఉంది. ఇంతటి బ్రహ్మాండమైన రాయి 6 కి.మీ. దూరంలో ఉన్న 'సరప్పాల్లం'' అనే గ్రామం నుంచి వాలుతలంపైన దొర్లించి తీసుకు రాబడింది. ప్రాచీన ఈజిప్టులో పిరమిడ్లు నిర్మించిన శిల్పులు కూడా ఇదే విధానాన్ని అనుసరించారు ముఖ్యంగా ఈ దేవాలయం గోపురం నీడ క్రింద పడదు. ఇది ఒక మహాద్భుతం

## ప్రపంచంలో మొట్టమొదటి బంగారు నాణెం

ప్రపంచపు మొట్టమొదటి బంగారు నాణెం 560 బి.సి.లో లిడియాలో క్రోసస్ (Croesus) రాజుచే ముద్రించబడింది. ఆనాటి నుంచి చెలామణిలో అనేక శతాబ్దాల పాటు రాజు తల ఒక ప్రక్క, మరో ప్రక్క అధికార చిహ్నాలతో బంగారు నాణాలు చేతితో ముద్రించబడేవి.

"ఆపదలో ఆదుకున్నవాడే నిజమైన స్నేహితుడు."

మహానంది దేవాలయం ముందు బ్రహ్మాండమైన గొప్ప నంది విగ్రహం ఒకటి ఉంది ఇది శివుని వాహనం. ఒకే పెద్ద నల్లరాతిలో అందంగా చెక్కబడిన ఈ నంది 16 అ. పొడవు, 12 అ. ఎత్తు, 7 అ. వెడల్పు కలిగి ఉంటుంది. ఇంత పెద్ద మహానంది భారతదేశంలో ఏకొద్ది చోట్ల మాత్రమే ఉంది.

ఇచ్చటి శిల్ప సంపద శైవ, వైష్ణవ ఆగమ శాస్త్రాలనుండి, మరియు బుద్ధ చరిత్ర నుండి సంగ్రహింపబడింది. ప్రాకారం లోపల గల దేవాలయాలలో గోడల మీద, స్తంభముల



మీద అనేక కుడ్య చిత్రాలు చిత్రింపబడ్డాయి ఇవి మహారాష్ట్రలో సుప్రసిద్ధ అజంతా చిత్రాలను, శ్రీలంకలోని సిగిరియా చిత్రాలను పోలి ఉంటాయి.

తంజావూరు రాజభవనం నాయక రాజులు నిర్మించారు. వీరు తంజావూరును 16వ శతాబ్దం మధ్యకాలంలో పాలించారు. పెద్ద పెద్ద ద్వారాలతో బ్రహ్మాండమైన దర్బారు హాలులు నిర్మింపబడ్డాయి. ఇచ్చట గల "కుడ" గోపురాన్ని, మాడమాలిగై గోపురాన్ని నగరంలో అన్ని దిక్కుల నుండి చూడవచ్చు.

సరస్వతీ మహల్ లైబ్రరీలో అనేక అపూర్వ సంస్కృత గ్రంథాలే గాక, సాహిత్యం, కళ, సంస్కృతికి చెందిన అనేక ప్రాచీన వ్రాత ప్రతులు, తాళపత్ర గ్రంథాలు ఎన్నో భద్రపరచబడ్డాయి. మరాఠా రాజు రాజా శరభోజీ నిర్మించిన ఈ గ్రంథాలయం పరిశోధకులకు ఎంతో ఉపయోగంగా ఉంటుంది. ఈ గ్రంథా



లయంలో 30,000 సంస్కృత, తమిళ, తెలుగు, మరాఠీ గ్రంథాలే గాక సైన్స్, వైద్యం, ఇంజనీరింగ్ ఖగోళశాస్త్రం, పెయింటింగ్ మరియు నృత్యం మొదలైన వాటికి సంబంధించిన

## రాగి ఉత్పాదనకు అరిజోనాది అగ్రస్థానం

*ప్రపంచపు రాగి గనులలో సుమారు 90 శాతం పశ్చిమ యునైటెడ్ స్టేట్స్, చైలీ, పెరూ, దక్షిణ మధ్య ఆఫ్రికా మరియు మధ్య కెనడాలో ఉన్నాయి ప్రపంచపు రాగి ఖనిజంలో సుమారు 25 శాతం యునైటెడ్ స్టేట్స్ గనుల నుండి లభిస్తుంది రాగి ఉత్పాద నకు యునైటెడ్ స్టేట్స్‌లో అరిజోనాది అగ్రస్థానం. యు ఎస్ ఎస్ ఆర్, జాంబియా, చైలీ, కెనడా, జెయిరే రిపబ్లిక్ రాగిని ఉత్పాదించే ఇతర ప్రదేశాలు*

"నీ మిత్రులెవ్వరో చెప్పు, నీవెవరో నేను చెబుతా."

గ్రంథాలు ఇతర యూరోపియన్ భాషలలో కూడా ఉన్నాయి వీటిని 300 సంవత్సరాలు శ్రమకు ఓర్చి తంజావూరు పాలించిన నాయక రాజులు, మహారాష్ట్రులు సేకరించారు.

సంగీత మహల్ ఇంజనీరింగ్ నైపుణ్యం మహాద్భుతమైనది ఇది శబ్ద శాస్త్రానుగుణ్యంగా అతి కచ్చితంగా నిర్మింపబడింది శరభోజీ మహారాజు నిర్మించిన ఈ మహల్ మధురలో



తిరుమల నాయకుని రాజభవనాన్ని పోలి ఉంటుంది. ఆర్టు గాలరీలో కంచు విగ్రహాలు, రాతి విగ్రహాలు శిల్ప సౌందర్యంతో అత్యంత రమణీయంగా ఉంటాయి.

తంజావూరులోని ష్వార్ట్జ్ (Schwartz) చర్చి దక్షిణ దేశంలో అతి గంభీరమైనది. దీనిని 1779 లో డేనిష్ మిషనరీ రెవరెండ్ సి.వి. ష్వార్ట్జ్ గౌరవార్థం శరభోజీ మహారాజు నిర్మించాడు. బ్రిటిష్ వారి నుండి తన సింహాసనాన్ని సంపాదించుకోడానికి ఈ మిషనరీ వారు శరభోజీకి సహకరించారు

తంజావూరులో ఇత్తడితోను, రాగితోను తయారుకాబడి వెండి తాపడం గల ఆర్నమెంటల్ ప్లేటులు, బవల్స్, వేసులు రకరకాలు లభిస్తాయి. భారతదేశపు సుప్రసిద్ధ వాద్యవిశేషం వీణను ఇక్కడే తయారుచేస్తారు. తంజావూరు వీణలు చాలా ప్రసిద్ధి చెందినవి.

కావేరి నదిగట్టున తంజావూరుకి 9 కి మీ ల దూరంలో తిరువయ్యారు ఉంది ఇక్కడే మాట్లాడు భాషలు వేరైనా, రాష్ట్రాలు వేరైనా, ఆంధ్రులు గాని, తమిళులుగాని, కేరళులుగాని, కర్ణాటకులు గాని అందరిదీ ఒకే సంస్కృతి అని, ఒకే సంగీతమని, ఒకే వేదాంతమని చాటిన 19 వ శతాబ్దపు నాద బ్రహ్మానందుడు త్యాగరాజు సమాధి ఉంది సంగీత త్రిమూర్తులలో ప్రసిద్ధుడైన త్యాగరాజు అనేక వేల కీర్తనలను తెలుగులో రచించాడు. కీర్తి శేషురాలు గాయక మణి అయిన బెంగళూరు నాగరత్నమ్మ 1925లో త్యాగరాజు సమాధిపైన ఆలయం కట్టించింది. ప్రతి సంవత్సరం జనవరిలో జరిగే త్యాగరాజ ఉత్సవాలకు, ఆరాధనకు అనేక మంది భక్తులు, గాయకులు వచ్చి ఉత్సవంలో పాల్గొంటారు అనేక ప్రాంతాల నుండి వచ్చిన విద్వాంసులు, గాయకులు గంటలకొద్దీ గాన సభలు, కాలక్షేపాలు చేస్తారు.

తంజావూరులో తమిళ విశ్వ విద్యాలయం ఉంది దక్షిణ దేశంలో ఇది ఒక ప్రముఖ విద్యాకేంద్రం.

## ఇంతవరకు అధిగమించని రికార్డు

*1972 మ్యూనిఖ్ క్రీడలలో యునైటెడ్ స్టేట్స్‌లో గజ ఈతగాడు మార్క్ స్పిట్జ్ ఏడు స్వర్ణపతకాలు - నాలుగు వ్యక్తిగత మరియు మూడు రిలే గెలుచు కొని రికార్డును స్థాపించాడు ఇతడు అంతకు ముందే 1968 ఒలింపిక్ క్రీడలలో 2 స్వర్ణపతకాలు పొంది మొత్తం తొమ్మిది గెలుచుకున్నాడు.*

"అన్ని వారసత్వాల్లో నిజమైన ఆస్తి నిజాయితీ."

# తెలుగు సాహిత్యం - శతకాలు

సీతా రవిచంద్రన్

"దేశ భాషలందు తెలుగు లెస్స" అని కవిసార్వభౌముని ప్రశంసనుపొంది రాణించింది తెలుగు భాష. వస్తువు ఏదైనా, రచనా ప్రక్రియ ఎట్టిదైనా, రసానంద జనకమైన తెలుగు సాహిత్యం 11వ శతాబ్దంలో ప్రారంభించి 18వ శతాబ్దం చివరి దాకా అనేక విధాలుగా భాసించింది అటుతరువాత 19వ శతాబ్దం నుంచీ పాశ్చాత్య ప్రభావం వల్ల తెలుగు సాహిత్యం ప్రాచీన ప్రక్రియలతో పాటు వివిధ నవ్య నూతన ప్రక్రియలతో వర్ధిల్లుతూంది ఇట్టి సాహిత్యంలో ప్రబంధాలు, పురాణాలు, ద్విపదలు, చిత్ర కావ్యాలు, ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యాలు, యక్షగానాలు, చాటువులు, శతకాలు, నవలలు, నాటకాలు, కథలు, గేయాలు ఎన్నెన్నో ఉద్భవించాయి.

శతకాలు అనడం తోటే అందరికీ పరిచిత మైన సుమతీ శతకం, వేమన శతకం, దాశరథీ శతకం, కృష్ణ శతకం మొదలైనవి జ్ఞాపకం రాకమానవు తెలుగులో శతకవాఙ్మయం భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి, శృంగార, హాస్య భావాలతో ఎంతో రసవంతంగా ఉంటుంది. శతం అనేదే శతకం. అంటే నూరు అని అర్థం నూరు పద్యాలతో వ్రాసినవి శతకాలు. కేవలం నూరే కాదు పైన ఎనిమిది చేర్చి శతకంలో 108 పద్యాలు వ్రాస్తారు. సంస్కృతంలో అష్టోత్తర శత (108) నామావళి స్తోత్రాల నుంచే ఈ శతక సంఖ్య ఏర్పడి ఉండాలి.

పూర్వం సంస్కృతంలో మయూరుని సూర్య శతకం, బాణుని చండీశ్వర శతకం, భర్తృహరి నీతి-శృంగార-వైరాగ్య శతకాలు ఎన్నో ఉన్నాయి. ఇవి శత (100), త్రిశతి (300), సప్తశతి (700), సహస్ర (1000) రకాలుగా అనేకం ఉన్నాయి. తెలుగులో 13వ శతాబ్దానికి పూర్వం అసలు శతకాలు లేవు. 13వ శతాబ్దంలో యథావాక్కుల అన్నమయ్య 'సర్వేశ్వర శతకం' రచించాడు. తెలుగు శతక వాఙ్మయంలో ఈ సర్వేశ్వర శతకమే మొట్టమొదటిది.

## న్యూస్ బాయ్‌గా ప్రారంభించిన ఎడిసన్


EDISON

థామస్ ఆల్వా ఎడిసన్ మొట్టమొదట న్యూస్ బాయ్‌గా గ్రాండ్ ట్రంక్ రెయిల్ రోడ్ రైలులో న్యూస్ పేపర్లు అమ్ముకునేవాడు. పని అయిన వెంటనే ఒక పార్సిల్ కారేజిలో ఏర్పాటు చేసుకున్న లాబొరేటరీలో కొత్త కొత్త ప్రయోగాలు చేస్తుండేవాడు ఇతడే తరువాత ప్రపంచంలో సుప్రసిద్ధ నవ్య వస్తుకల్పనా చతురుడుగా ప్రసిద్ధి పొందాడు.

"నిజాయితీ లోపిస్తే విజ్ఞానం ప్రమాదకరం."

ప్రాకృతం, బౌద్ధ, జైన వాఙ్మయాలలో వీరశైవుల వల్ల తెలుగు భాషలోకి శతకాలు వ్యాపించా యని చెప్పుకోవచ్చు. దీని తరువాత సోమన "వృషాధిప శతకం", పోతనామాత్యుడు "నారాయణ శతకం" రచించారు చక్కని రచనా విధానాన్ని సమకూర్చి శతక శబ్దాన్ని రూఢి యొనర్చిన కవి సోమన.

ఈ శతకాలకు కొన్ని నియమాలు ఉన్నాయి ప్రతి శతకం శ్రీకార సహిత ప్రార్థనతో ప్రారంభ మవుతుంది. 'శ్రీయనమంగళదేవత' - వేమన శతకం, "శ్రీరాముని దయచేతను"—సుమతీ శతకం, "శ్రీ రఘురామ చారుతులసీ దళదామ' - దాశరథి శతకం, "శ్రీగల భాగ్యశాలి కడచేరగ వత్తురు" - భాస్కర శతకం, "శ్రీ రుక్మిణీశ! కేశవ!" - కృష్ణ శతకం మొదలైనవి వీటన్నిటి లోను మకుటం ఉంటుంది ఈ మకుటం ఒకటి రెండు పాదాలలో గాని, ఆఖరి పాదం మధ్యభాగంలోగాని ఉంటుంది. కొన్ని చోట్ల పద్యాంతంలో సంభోధనగా ఉంటుంది. సామాన్యంగా మకుటానికి అనుకూలంగా ఉండే వృత్తాలలోనే అన్ని పద్యాలు ఉంటాయి ఈ మకుటాన్ని బట్టే శతకం అంతా .ఒకే విధమైన ఛందస్సులో వ్రాయవలసిన బాధ్యత కవికి ఏర్పడుతుంది. శ్రీ కాళహస్తీశ్వరా, దాశ రథీ కరుణా పయోనిధీ!, విశ్వదాభిరామ వినుర వేమ!, గువ్వల చెన్నా, భాస్కరా మొదలైనవి ఆయా శతకాల మకుటాలు

కందం, సీసం, మత్తేభం, శార్దూలం, చంపక మాల, ఉత్పలమాల వృత్తాలలో అనేక శత కాలు ఉన్నాయి. వీటి అన్నిటిలోను భక్తి ప్రధానము లైన శతకాలు చాలా అధికం. కొన్ని శివపరం గాను, మరికొన్ని విష్ణుపరంగాను ఉన్నాయి. శతకాలు అన్నీ చదువుకొనే వారికి భావ వికాసం, మానసికానందం, పురుషార్థం కలుగజేస్తాయి. పురుషార్థానికి పరమావధి అయిన మోక్షప్రాప్తే శతక ప్రయోజనం. భావోద్రేకం కలిగినప్పుడే శతకం వ్రాయబడు తుంది. శతకంలో ముఖ్య పాత్ర భక్తుడు. కవి ప్రత్యక్షంగా భగవంతునితో మాట్లాడుతున్నట్లు ఉంటాయి కొన్ని శతకాలలో కవి పేరు మకుటంలో ఉంటుంది. 15-17 శతాబ్దాలలో తాళ్ళపాక వారి శతకాలు కొన్ని ఉన్నాయి. కృష్ణరాయలకు పూర్వం భాస్కర శతకం రచింపబడింది. కృష్ణదేవరాయల .కాలంలో ధూర్జటి కాళహస్తీశ్వర శతకం ప్రసిద్ధి చెందింది రాయలు తరువాత 16-17 శతాబ్దాల్లో వేణుగోపాల, చంద్రశేఖర, కుక్కుటేశ్వర రామలింగ శతకాలు కనిపిస్తున్నాయి. ఆ తరు

## ఆఫ్రికాలో అంతరించి పోతున్న బ్లాక్ రైనో



*ఈనాడు ఆఫ్రికాలో అంతరించి పోతున్న భయంకర పరిస్థితిలో ఉన్నది బ్లాక్ రైనో. 30 సంవత్సరాల కాలంలో బ్లాక్‌రైనోల సంఖ్య 100,000 నుండి నేడు 4,000కి పడిపోయింది పది సంవత్సరాలలో కెన్యాలో రైనోల సంఖ్య 1,500 నుండి 475కి పడిపోయింది.*

(సిఇఇ - ఎన్ఎఫ్ఎస్ సౌజన్యంతో)

"తప్పేదైనా తప్పక సరిదిద్దుకోవాలి."

వాత 17వ శతాబ్దంలో శతక వాఙ్మయం ఎక్కువగా వర్ధిల్లింది. నీతి శతకాలలో వేమన శతకం చాలా గొప్పది. "తల్లి నెరుగు వాడు దైవంబు నెరుగును", "అప్పు లేనివాడు యధిక సంపన్నుడు", "చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?", "కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?", "కొండ యద్దమందు కొంచమై ఉండదా", "తలలు బోడులైన తలపులు బోడులా" మొదలైన సామాన్య సామెతలతో వేమన యోగి నీతిదాయకములైన పద్య రత్నాలను ఎన్నిటినో రచించాడు. అసలైన తెలుగు మాటలతో, సాటిలేని నీతులతో వేమన పద్యాలు తెలుగుశతక సాహిత్య సాగరంలో అమూల్యాలు. పరుల బాధలను తన బాధగా భావించేవాడే మానవుడు అన్నాడు వేమన. కవి, తాత్త్వికుడు, దార్శనికుడు, ఉదాత్తుడు అగు వేమన అన్ని జాతులకు, అన్ని కాలాలకు వర్తింపగల సందేశాన్ని ఇచ్చాడు మానవులు మానవులుగా జీవిస్తే ఈ భూలోకమే స్వర్గలోకం అన్నాడు.

ఎవరు వ్రాసారో తెలియదు, ఎప్పుడు వ్రాసారో తెలియదు కాని "అవకారికి నుపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి", సమయానికి తగినట్టుగా మాటలాడుతూ ఒకరిని నొప్పించకుండా తాను మాటపడక వ్యవహరించే వాడు ధన్యుడు అంటూ "తమ మిత్రులు శత్రులౌటతథ్యము" "పరస్పర ప్రేమ వల్ల తప్పులు కనబడవు", "కూరిమి విరసంబైనను నేరములే తోచుచుండు", "ఖలునకు నిలువెల్ల విషము", "మాటకు ప్రాణము సత్యము", "తన వారికెంత కలిగిన, తన భాగ్యమె తనకు గాక తథ్యము", "తమ తమ నెలవులు దప్పిన, తమ మిత్రులె శత్రులౌట తథ్యము" అనే నీతులు సుమతీ శతకంలో తేటతెలుగులో చెప్పబడ్డాయి. "శ్రీ రుక్మిణీశ కేశవా! నీవే తల్లివి, తండ్రివి, నీవే నాతోడు నీడ, నీవే సఖుడౌ, నీవే గురుడవు, దైవము, నీవే నా పతియు, గతియు, దిక్కెవ్వరు? నీవే నాకు దిక్కవు, తహతహ లెక్కడివి నిన్ను దలచిన కృష్ణా!" అంటూ కృష్ణశతకం భక్తిరసంతో ఉట్టిపడుతూంటుంది.

ఈ విధంగా సుమతీ శతకం, దాశరథీ శతకం, భాస్కరశతకం, కృష్ణశతకం, నరసింహ శతకం, కుమార శతకం, చిరవిభవ శతకం, మదనగోపాల శతకం, కలువాయి, కాంతాలలామ మొదలైన శతకాలు తెలుగు వాఙ్మయంలో 1000కి మించి ఉన్నాయి.

## తనవారిపై విరక్తి చెందితే



తనవారిపై విరక్తి చెందినవాడు విదేశీయులను తన వారిగా చేసుకోలేడు తన ఇంటివారిని వదలుకున్నవాడు ప్రపంచంలో ఎవరినీ ఆహ్వానించలేడు.

-ఠాగూర్

"సిరి మనని వెతుక్కుని రావచ్చు - జ్ఞానాన్ని మనం వెతుక్కుని పోవాలి."

# తల్లిదండ్రులకు సందేశం

1 మీ పిల్లనుగాని, పిల్లవాడిని గాని ప్రేమతో ఆదరించండి. మీ పిల్లల భుజాలపై చేతులు వేసి "నువ్వు అంటే నాకు ఎంతో ప్రేమ, అభిమానం అని ఆప్యాయంగా చెప్పండి.



2 మీ పిల్లలతో కాలం గడపండి. వస్తు వాహనాల కంటె మీ పిల్లలకి మీ పరిపూర్ణ ప్రేమాభిమానాలు ఎంతో ముఖ్యం.

3 మీ పిల్లలను క్రమశిక్షణలో పెట్టండి. మీరు క్రమ పద్ధతిలో జీవించడం ప్రారంభిస్తే మీ పిల్లలకు క్రమశిక్షణ దానంతటదే అబ్బుతుంది.

4 ధనాత్మక భావంతో, ఉత్సాహంగా, ఆనందంగా జీవించండి మీ పిల్లలు మీ దగ్గరనుంచే నేర్చుకుంటారు అనేది గ్రహించండి.

5. మీరు పిల్లలకు ఇచ్చిన మాట ఎన్నటికీ తప్పవద్దు.

6 మీ పిల్లలకి మంచి నడవడి, అలవాట్లు నేర్పండి ఎప్పటి పని అప్పుడు చేయడం, సరైన భాష, సక్రమంగా ఖర్చుపెట్టడం, నాగరిక ప్రపంచంలో అవసరమైన విషయాలు నేర్పండి

7 మీ పిల్లలు కాల పట్టికను అనుసరించి నడచుకొనేటట్లు చేయండి. పిల్లలు క్రమ బద్ధంగా ఉండకపోవడం సహజం.

8 మీ పిల్లల దగ్గర వారి ఉపాధ్యాయులను గురించి ఎప్పుడూ మాట్లాడవద్దు. మీ పిల్లలకు అదే అలవాటు అయిపోతుంది.

—డా. జె. పాల్ కెన్నెల్
('ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో)

# సుభాషితాలు

*టిప్పణములుచేసి చప్పని మాటలు*
*చెప్పుచుందురన్ని స్మృతులు శ్రుతులు*
*విప్పిచెప్పరేల వేదాంత సారంబు*
*విశ్వధాభిరామ వినురవేమా!*

*[వేదాలకు, ధర్మశాస్త్రాలకు వ్యాఖ్యానాలు చెబుతారేగాని (డాంభికులు) వాటిలో సారాన్ని చెప్పలేరు.]*

*కుండ కుంభమన్న కొండ పర్వతమన్న*
*నుప్పు లవణమన్న నొకటికాదె?*
*భాష లిట్లు వేరు, పరతత్త్వ మొక్కటే*
*విశ్వధాభిరామ వినురవేమా!*

*[భాషలు వేరైనా అవి చెప్పే వస్తువు ఒక్కటే. కుండ - కుంభము ఒక్కటే. కొండ - పర్వతం ఒక్కటే. ఉప్పు - లవణం ఒక్కటే.]*

"ఇతరులను సంస్కరించటానికి ముందు నిన్ను నీవు సంస్కరించుకో."

# వ్యక్తిత్వానికి శీలం ప్రధానం

ఒక వ్యక్తి యొక్క శీలం, వివేకం, చాతుర్యం, గొప్పతనం, ఘనత, ఔదార్యం, నైతిక పద్ధన, ప్రతిభ, కొన్ని ప్రత్యేక సామర్థ్యాలు, ముఖ లక్షణాలు, కంఠస్వరం వగైరా అవ్యక్తి వ్యక్తిత్వాన్ని తెలియజేస్తాయి వ్యక్తిత్వమే మనిషి నుండి మనిషిని వేరు చేస్తుంది, ప్రత్యేకత కలిగిస్తుంది



సౌశీల్యంవల్ల ఒక మనిషికి వ్యక్తిత్వం ఏర్పడు తుంది. వ్యక్తిత్వం గల మనిషిని అందరూ గౌరవిస్తారు. వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకోవచ్చు. సద్గుణాలను తప్పనిసరిగా అభ్యాసం చేసుకోవాలి. ఎప్పుడూ నిర్విచారంగా, సంతోషంగా ఉండాలి. ఎదుటివారికి తగినట్టుగా ఎలా నడచు కోవాలో, ఎలా ప్రవర్తించాలో, ఎలా సరి పెట్టుకోవాలో తెలుసుకోవాలి. మర్యాదగా, మెల్లగా మృదు మధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి. నాగరి కంగా, సరసంగా మసలుకోవడం అలవాటు చేసుకోవాలి. ఎదుటివారిని గౌరవించి ఆదరించడం అభ్యసించాలి నమ్రత, వినయం, విధేయత అనే సద్గుణాలు ఉంటే ఇతరులను సులభంగా లోబరుచుకోవచ్చు. నడత చాలా ముఖ్యం. అహంకారం, మొండి పట్టుదల, మూర్ఖత్వం ఉంటే ఎన్నటికీ వ్యక్తిత్వాన్ని పొందలేరు ఇటువంటి వారిని అందరూ ద్వేషిస్తారు. మాటలో తడబాటు వద్దు ఆందోళన పడిపోవద్దు నిరాశ పడిపోయి అధైర్యం చెందకూడదు. ఒకరిని అభినందించే టప్పుడు నిట్టనిలువుగా నుంచోవద్దు మెల్లిగా తలవంచి వినయంతో అభినందించు

## ఎమ్.పి. బిర్లా లైబ్రరీలో రెఫరెన్స్ వైద్య గ్రంథాలు

*బొంబాయిలో ఎమ్.పి బిర్లా గ్రంథాలయంలో 6,000 కు పైబడిన రెఫరెన్స్ గ్రంథాలు, సుమారు 175 చందాలు కట్టిన వైద్య మెడికల్ జర్నల్స్ ఉన్నాయి. భారతదేశంలో ఇక్కడ వైద్యం మీద అపూర్వమైన రెఫరెన్స్ గ్రంథాలు ఉన్నాయి. ఇక్కడ ఒక్క చోట మాత్రమే మెడికల్ వీడియో కాసెట్‌లను స్క్రీన్ చేయడానికి దృశ్య శ్రవణ విభాగం ఉంది*

*—('టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో)*

## పాఠశాలలలో శిక్షణ లేని ఉపాధ్యాయులు అధికం

*భారతదేశం వివిధ పాఠశాలలలో సుమారు 13 శాతం ప్రాథమిక తరగతులలో, 10 శాతం సెకండరీ మరియు 11 శాతం హయ్యర్ సెకండరీ తరగతులలో శిక్షణ లేని ఉపాధ్యాయులు అధికంగా ఉన్నారు.*

*(5వ ఆల్ ఇండియా ఎడ్యుకేషన్ సర్వే - NCERT)*

"ప్రియంగా, హితంగా, మితంగా మాట్లాడు."

# పుష్కర మహోత్సవం

ఈ ఆగస్టులో గోదావరి నదికి రాజమండ్రిలో పుష్కరాలు జరుగుతున్నాయి. ఇది ఒక అపూర్వ అవకాశం. సుప్రసిద్ధ నదీ తీర ప్రదేశాలలో పన్నెండు సంవత్సరాల కొకసారి జరిగే మహోత్సవం పుష్కరం. నవగ్రహాలలో గురుడు సూర్యుని చుట్టూ తిరగడానికి 12 సంవత్సరాల కాలం పడుతుంది. ఒక్కొక్క భ్రమణం పూర్తిచేసుకున్న గురుడు - మేషం, వృషభం మొదలైన 12 రాశులలో ఒక్కొక్క రాశిలో ప్రవేశిస్తూంటాడు. ఈ విధంగా ఒక్కొక్క రాశిలో గురుడు ప్రవేశించినప్పుడు భారత దేశంలో గల ఒక్కొక్క నదికి ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవమే పుష్కర ఉత్సవము

గురుడు మేషరాశిలో ప్రవేశించినప్పుడు గంగానదికి, వృషభరాశిలో ప్రవేశించినప్పుడు నర్మదానదికి, మిధునరాశిలో ప్రవేశించినప్పుడు సరస్వతీనదికి, కర్కాటకరాశిలో ప్రవేశించినప్పుడు యమునానదికి, సింహరాశిలో ప్రవేశించినప్పుడు గోదావరినదికి, కన్యలో ప్రవేశించినప్పుడు కృష్ణానదికి, తులారాశిలో ప్రవేశించినప్పుడు కావేరినదికి, వృశ్చికరాశిలో ప్రవేశించినప్పుడు భీమనదికి, ధనస్సులో ప్రవేశించినప్పుడు తామ్రపర్ణినదికి, మకరంలో ప్రవేశించినప్పుడు తుంగభద్రానదికి, కుంభరాశిలో ప్రవేశించినప్పుడు సింధునదికి, మీనరాశిలో ప్రవేశించినప్పుడు తపతీ నదికి పుష్కర ఉత్సవాలు జరుగుతూంటాయి.

ఈ ఉత్సవాలకు పుష్కరం అనే పేరు పెట్టిన పుష్కరుడు మందాకిని కుమారుడు పుష్కరునికి - గురువుకి గల సంబంధం ఇంతవరకూ తెలియలేదు పుష్కర సమయంలో ఈ పుష్కరుడు 33 కోట్ల దేవతలతో,

## ప్రజ్ఞావంతులైన పిల్లలు




సామాన్యంగా ప్రజ్ఞావంతులైన పిల్లలందరికీ లక్షణాలు సమానంగా ఉంటాయి

వీళ్ళు తరచుగా -

- తీరిక లేకుండా చదువుతూంటారు.
- త్వరగా మాట్లాడటం ప్రారంభిస్తారు
- క్రొత్త క్రొత్త మాటలు ఉత్సాహంతో నేర్చుకుంటారు.
- కొత్త విషయాలు తెలుసుకోవాలని ఆరాటపడతారు. ఊరికే ప్రశ్నలు వేస్తుంటారు
- ఏకాగ్రతను అవలంబిస్తారు.
- ప్రతి పనిని పూర్తిగా నెరవేరుస్తారు
- గ్రహణశక్తి అధికంగా ఉంటుంది. హాస్య ధోరణి ఉంటుంది.
- తమది ప్రత్యేకమైన వ్యక్తిత్వం అని వారికి తెలుసు.

—('హెల్త్' సౌజన్యంతో)

"ద్వేషాన్ని ద్వేషంతో జయించలేము. కాని ప్రేమతో జయించవచ్చు."

ఋషులతో ఆయానదులలో స్నానాలు చేస్తాడని, ఆ అపూర్వ అవకాశం వినియోగించుకుని మనం కూడా స్నానాలు చేస్తే మన పాపాలు పోతాయని భక్తుల నమ్మకం, విశ్వాసం.

పుష్కరం అనే పదం సంస్కృత పదం. పుష్కరం అంటే నీరు, కూడిక, సంయోగం మొదలైన అర్థాలు అనేకం ఉన్నాయి. పుష్టిని కలిగించేది, పుష్టికరమైనది, పోషించేది అనే అర్థాలు కూడా ఉన్నాయి. గౌతమ మహాముని తెలియక గోవుని చంపుతాడు. ఆ పాపాన్ని పోగొట్టడానికి గోదావరి మహానది శివుని జటాజూటం మీదుగా ప్రవహించిందని, అందుకే ఈ నదికి గౌతమి అని పేరు వచ్చిందని గాథ. సృష్టి ఆదిలో గురుడు సింహంలో ప్రవేశించినప్పుడు గోదావరి పశ్చిమ కనుమలగుండా ప్రవహించిందని హిందువుల నమ్మకం.

రాజమండ్రి దగ్గర గోదావరి నదిలో కోటి లింగాల రేవు చాలా ప్రాముఖ్యమైనది. ఆ రేవులో అనేక రాళ్ళు ఉన్నాయి ఇవన్నీ శివలింగాలు అంటారు. కోటి లింగాలు తరువాత ముఖ్యమైనది- మార్కండేయ దేవాలయం. దీనికి ఎదురుగా మార్కండేయ ఘాట్ ఉంది

ఉత్తర ఇండియాలో హరిద్వార్, అలహాబాద్, నాశిక్, ఉజ్జయినిలలో వరుసగా12 సంవత్సరాల కొకసారి జరిగే కుంభమేళా చాలా ముఖ్యమైనది. దక్షిణాదిని రాజమండ్రిలో గోదావరి పుష్కరం, బెజవాడలో కృష్ణా పుష్కరం, కుంభకోణంలో మహామాఘం చాలా బ్రహ్మాండంగా జరుగుతాయి కుంభకోణంలో మాత్రం కుంభేశ్వర ఆలయ ప్రాంగణంలో ఉండే పుష్కరిణిలో స్నానాలు చేస్తారు.

రాజమండ్రిలో పుష్కరాలకు భారతదేశంలో వివిధ ప్రదేశాల నుంచి కోటానుకోట్ల యాత్రికులు వస్తారు. ఈ పుణ్య సమయంలో నదిలో స్నానాలు చేయడం పరమ పవిత్రమని భారతీయులు భావిస్తారు భక్తితో నదిని పూజిస్తారు. నైవేద్యాలు పెడతారు. ఈ పుష్కర సమయంలో రాజమండ్రి దగ్గర ధవళేశ్వరం, ద్రాక్షారం, కోటిపల్లి, ముక్తేశ్వరం రేవులలోకూడా స్నానాలు జరుగుతాయి. గోదావరికి ఆవలి గట్టు పశ్చిమ గోదావరి జిల్లాలో కొవ్వూరు, తీపర్రు, సిద్ధాంతం, లక్ష్మీపాలెం, నర్సాపురం, వాడపల్లి కూడా చాలా ముఖ్యమైన ఇతర పుణ్యక్షేత్రాలు

— తాడూరి

●

## సూర్యుని అనంత శక్తి



సూర్యుని బ్రహ్మాండమైన శక్తి ఊహాతీతం. సూర్యుని నుండి అన్ని దిక్కులకు ప్రసరింపబడే వేడి ఏ కొంచెమో మాత్రమే భూమికి చేరుతూంది. ప్రపంచంలో ప్రతి సంవత్సరం త్రవ్వబడే బొగ్గుకు 50,000 రెట్లు బొగ్గును మండించినప్పుడు పుట్టేటంత వేడి సూర్యుని వల్ల లభిస్తూంది అని అంచనా వేయబడింది. ఒక సంవత్సరంలో ఉత్పాదింపబడే సూర్యుని వేడి ప్రపంచం అంతా భూతలం పైన 90 అడుగుల దళసరి మంచును కరిగించడానికి తగినంత ఉంటుంది.

"నిర్మలమైన హృదయమే నిశ్చితమైన దైవ నివాసం."

# ప్లాటిపస్

ఎల్.బాలసుబ్రమణియం

బీవర్‌తోక, పిల్లిబొచ్చు, బాతుముక్కు, అట్టర్ పాదాలు కలిగి ఉండేదే ప్లాటిపస్ ఇది గ్రుడ్లను పెట్టి సంతానోత్పత్తి కలిగించు కుంటూ వంశాన్ని అభివృద్ధి చేస్తుంది.

ప్లాటిపస్ 'మోనోట్రెమెస్' (Monotremes) అనే జంతువుల గుంపుకు చెందినది ఇవి క్షీరదాలు. అయినా ఇవి గ్రుడ్లను పెడతాయి



మోనోట్రెమెస్ పిల్లలు గ్రుడ్ల నుంచి పైకి వచ్చిన తరువాత ఇతర క్షీరదాలలాగే తల్లులు పాలు ఇచ్చి పెంచుతాయి. గ్రుడ్లను పెట్టే మరో క్షీరదం ఆస్ట్రేలియా దేశపు స్పైనీ ఆంట్ ఈటర్ (spiny ant eater) మిక్కిలి ఆశ్చర్యంగా కనిపించే ప్లాటిపస్ శరీరంలో దాని వెడల్పాటి బాతు ముక్కు చాలా ప్రసిద్ధి పొందింది. ముక్కులో ఎముక ఉండదు. చాలా మృదువుగా, పొడవుగా ముట్టెలాగా ఉంటుంది. ముక్కు రంధ్రాలు ముక్కుకు పైన ఉంటాయి. దీని ముక్కు దీనికి స్పర్శేంద్రియంగా ఉపయోగపడు తుంది. దీని నిండా జ్ఞాననాడులు క్రిక్కిరిసి ఉంటాయి.

సాధారణంగా ఒక్క టాస్మేనియా మరియు ఆస్ట్రేలియాల్లలో మంచినీటి చెరువులలో, గుంటలలో, పెద్ద పెద్ద నదులలో ఇవి నివసిస్తాయి మిక్కిలి అందమైన ప్లాటిపస్‌ను నీటి అడు గున వేటాడతారు ఇది చాలా చిన్నది 60 సె.మీ.లు పొడవుగా ఉంటుంది. కాని దీనిపై గల దళసరి పాటి చర్మం వదులుగా ఉండటం వల్ల, చాలా పెద్దదిగా కనిపిస్తుంది

నీటిఅడుగున నివసించడానికి అనుగుణ్యంగా ఉండే ప్లాటిపస్ భూమి మీద సరిగా నడవలేదు మొద్దుగా లావుగా ఉండే కాళ్ళు చాలా వెడల్పుగా ఉంటాయి ముందు కాళ్లకు వ్రేళ్ళను మించి పాదాలు ఉంటాయి నీటిలో ఇవి వాటికి

## ఏకైక పరమాత్మ భావనను ప్రతిపాదించిన మొట్టమొదటి వ్యక్తి

*ఒక చక్రవర్తి తన రూపంలో పరమాత్మను రూపొందించినది చారిత్రక వాస్తవం బి.సి 14వ శతాబ్దంలో ఫారోహియన్ చక్రవర్తి ఇక్‌హాంటాన్ (Ikhanton) ఏకైక పరమాత్మ భావాన్ని ప్రతిపా దించిన మొట్టమొదటి వ్యక్తి దీనిని అనుసరించే ఇతర దేశాలు, సంస్కృతులు, నాగరికతలు, మతాలు, ఈ ఏకైక పరమాత్మ భావాన్ని అంగీకరించాయి.*

'(క్వెస్ట్ ఆఫ్ హాపీనెస్)'-
ఎల్.ఎస్. సమత్

"కెంపులకన్నా ఇంపైనది జ్ఞానం."

తెల్లుగా ఉపయోగపడతాయి. ప్లాటిపస్ నీటి అడుగున 5 నిముషాల పాటు నివసించగలదు.

నీటిలో ఉన్నప్పుడు ప్లాటిపస్ కళ్లు, చెవులు మూసుకుంటుంది. నీటి అడుగున ముక్కుతో ఆహారం వెతుక్కుంటుంది. నీటిలో ఉండే నత్తలు, చిన్న చిన్న జంతువులు, వాటి లార్వాలు మరియు నీటిలో పడిన ఎగిరే కీటకాలు దీని ఆహారం.

ఆస్ట్రేలియాలో శీతకాలంలో జూలై నుంచి అక్టోబర్ వరకు ప్లాటిపస్‌లు జతకూడుతాయి గ్రుడ్లు పెట్టే సమయం వచ్చినప్పుడు ఇవి నీటిగట్ల మీద నీటితలంనుంచి సుమారు 25 మీటర్లు పొడవుగా సన్నని కాలువ చేస్తుంది దాని చివర ఆకులు, కొమ్మలు, గడ్డిపెట్టి గూళ్లు కడతాయి వీటిలో ఒకటి మొదలు మూడు గ్రుడ్లు పెడతాయి ఇవి మృదువుగా చర్మంలా ఉంటాయి. 12 రోజులలో గ్రుడ్లు వాటంతటవే పెరుగుతాయి ఈ సమయంలో ప్లాటిపస్‌లు గ్రుడ్లు పెట్టిన స్థలం నుంచి కదలవు.

క్రొత్తగా గ్రుడ్లలోంచి వచ్చిన ప్లాటిపస్ 25 సెంటీమీటర్ల పొడవుగా ఉంటుంది. కళ్ళు కనిపించవు. నగ్నంగా ఉంటుంది తల్లి కడుపు మీద ఉండే బొచ్చును నాకి పాలు తాగుతుంది. ప్లాటిపస్‌కి చనుమొనలు ఉండవు.

కుందేళ్ళు త్రవ్విన చోట భూమిలో ఇవి గ్రుడ్లను పెట్టవు. ప్లాటిపస్ దాని గ్రుడ్లు పొదగ డానికి భూమి చిందర వందరగా కాకుండా ఉండాలి. ప్లాటిపస్‌లు చాలా తక్కువగా ఉన్నా తగిన ముందు జాగ్రత్తల వల్ల ఈ జాతి ఇంకా అంతరించి పోలేదు.

-(సి.ఇ ఇ.ఎన్.ఎఫ్.ఎస్ సౌజన్యంతో

# మానసిక ఉత్సాహానికి తోడ్పడే కార్యకలాపాలు



- నీకు సంతోషం, ఆనందం కలిగించేదానిని దేనినైనా ఆలోచించు
- ప్రతిరోజూ ఏదో కొంచెం వ్రాస్తూండు. స్నేహితు డికి ఒక ఉత్తరం, లేకపోతే నాల్గు వంక్తులు పద్యం వ్రాయి. ఒక సుప్రసిద్ధ రచయితను గూర్చి వ్రాయి
- వివిధ పనులు చేస్తూండు మ్యూజియంకి వెళ్ళు, ఉపన్యాసాలకు వెళ్లు
- నీ ప్రతిభను సక్రమంగా ఉపయోగించుకో పెయింటింగ్ చేయి, చేతిపనులు చేయి, పాటలు పాడు.
- ఉత్తేజకరమైన గ్రంథాలు చదువు అవి నీ మనస్సులో మార్పు కలిగించాలి మానసికంగా ఉత్సాహం పెంపొందించుకోవాలంటే వీటిలో ఏదైనా ముందు ప్రారంభించవచ్చు. దీనివల్ల ఆత్మానందం కలుగుతుంది. మంచి స్నేహితుడవు అనిపించుకుంటావు.

-(హెల్త్ సౌజన్యంతో)

"చదవడం నేర్చుకుంటే ప్రతీ మనిషి ఒక గ్రంథమే."

# విటమిను 'C' ప్రాధాన్యత

మానవుని ఆరోగ్యాభివృద్ధికి విటమిను 'C' ప్రాధాన్యత ఏమిటి? ఇటీవల వివిధ ప్రాతిపదిక శారీర విధానాలకు ముఖ్యమైన జీవ రసాయనిక (bio-chemical) పదార్థంగా విటమిను 'C' గుర్తించబడింది. శరీరంలో ప్రవహించే రక్తానికి ముఖ్యావసరమైన ఫోలిక్ ఆసిడ్ (folic acid) వంటి జీవ రసాయనిక పదార్థాల వినియోగానికి ఇది చాలా అవసరం. శరీరంలో విటమిను 'C' పరిమాణం తగ్గిపోతే ఎడ్రినాలిన్ (adrenalin) మరియు థైరాయిడ్ Thyroid) వంటి హార్మోనులు కావలసిన పరిమాణంలో ఉత్పత్తి కావు ముఖ్యంగా ఈ విటమిను వల్ల శరీరంలో నైట్రోసామైన్స్ (Nitrosamines) తయారై కాన్సర్ వ్యాధి రాకుండా నైట్రైట్స్ (nitrites) అనబడే ఆహార సంబంధమైన రసాయనిక పదార్థాలను నిరోధిస్తుంది. నైట్రైటులను నిరపాయకరం చేస్తుంది

విటమిను 'C' వల్ల కాలేయంలో కొలెస్టరాల్ అనే క్రొవ్వు పదార్థం లివర్ బైల్ ఆమ్లాలుగా మారి నిరపాయకరంగా విసర్జింప బడుతున్నాయి. గుండె ధమనులు గట్టిపడి పోకుండా చేసి గుండె పోటు రాకుండా నివారిస్తుంది.

మానవ శరీరంలో కాలేయం (లివరు) తయారు చేసే ఎంజైములు రక్తంలో ఆల్కహాలును విచ్ఛిన్నం చేస్తాయి విటమిను 'C' సరఫరా బాగా లోపిస్తే వ్యక్తి లివరు (కాలేయం) అవసరమైనంతగా ఎంజైములను తయారు చేయదు. దీనివల్ల ఆ వ్యక్తి చాలాసేపు స్పృహ తప్పి పోయి ఉంటాడు.

మెదడు ఆరోగ్యవంతంగాను, సక్రమంగాను పనిచేయడానికి విటమిను 'C' చాలా అవసరం విటమిను 'C' లోపం వల్ల మందమతి, నిరుత్సాహం ఏర్పడుతుంది. బుద్ధి తీక్షణంగా పనిచేయదు. మెదడు సక్రమంగా పనిచేయడానికి కొన్ని సైక్లిక్ యౌగికాలు (Cyclic compounds) విటమిను 'C' వల్ల తయారవుతాయి.

## జిన్‌సెంగ్‌లో సూపర్ విటమిన్ పోషకాంశాలు



ఫార్ ఈస్ట్ ప్రదేశాలలో లభించే జిన్‌సెంగ్ (Ginseng) వేరులో సూపర్ విటమిను పోషకాంశాలు ఉన్నాయి. ఇది యునైటెడ్ స్టేట్స్‌లో చాలా ప్రసిద్ధి పొందింది ఎండిన జిన్‌సెంగ్ వేళ్ళు చూర్ణం చేసి దానిని కాప్స్యూల్‌లో, ఇన్‌స్టంట్ టీలో తీసుకుంటారు. ప్రాచీన కొరియాలోను, ఉత్తర చైనా ప్రదేశాలలోనూ జిన్‌సెంగ్ వేళ్ళుతో టీ తయారు చేసుకుని శరీర ఆరోగ్యం బాగా వృద్ధి పొందడానికి త్రాగేవారు.

"నీ శత్రువును జాగ్రత్తగా గమనించు - ఎందుకంటే నీలోని లోపాల్ని ప్రథమంగా గుర్తించేది వారే."

# అసలైన వీరులు

ఎన్ని ప్రతిబంధకాలు, ఆటంకాలు ఉన్నా ఒలింపిక్ క్రీడలలో రాణించిన వారే అసలైన వీరులు. ఆధునిక ఒలింపిక్ క్రీడలు ఏథెన్స్ (గ్రీస్)లో 1896 లో ప్రారంభమైనప్పుడు కొన్ని దేశాలు మాత్రమే పాల్గొన్నాయి. క్రీడాకారులు అప్పుడు పూర్తిగా యూనివర్సిటీ జట్టుల



నుంచే ఎన్నుకోబడ్డారు. కాని ఒలింపిక్ క్రీడలకు ఇచ్చిన ప్రచారం వల్ల 1900 లో రెండవ సారి పారిస్ (ఫ్రాన్స్)లో ఒలింపిక్ క్రీడలు నిర్వహించ బడినప్పుడు ఈ క్రీడలలో పాల్గొనే వారి సంఖ్య 484 నుంచి 1505 కి పెరిగింది. ప్రపంచంలోని క్రీడాభిలాషులు అందరూ పారిస్‌లో రికార్డు ప్రదర్శనలకు ఎదురు చూస్తున్నారు.

కలత ప్రారంభమైంది. వివిధ టీములు పారిస్‌కు వచ్చేటప్పటికి బ్రహ్మాండమైన ట్రాక్‌కు బదులుగా ఎగుడు దిగుడుల రోడ్డు కన్పించింది. పరుగు పందాలలో పాల్గొనే వారికే కాదు-డిస్కస్ త్రోయెర్లకు, హామర్ త్రోయెర్లకు కూడా ఎంతో కష్టమనిపించింది. చెట్లలోకి, పుట్లలోకి విసరవలసి వచ్చింది! ఫ్రెంచి వారి ఒలింపిక్ క్రీడలు పారిస్ వరల్డ్ ఫెయిర్‌లో ఒక ప్రదర్శనఏమో అనిపించాయి. ఇట్టి పరిస్థితులలో వివిధ దేశాల నుంచి వచ్చిన టీములు విసుగుతో తిరిగి వెళ్ళిపోయి ఉంటే ఆశ్చర్యం అనిపించేది కాదు. అయినా బ్రిటిష్ మరియు అమెరికన్ టీములు ట్రాక్ లేక పోయినా ఎలా ఉన్నా రోడ్డు మీద పరిగెత్త డానికి నిశ్చయించు కున్నాయి. అప్పుడు మిగతా టీములు మనస్సులు మార్చుకున్నాయి

ఆటంకాలు, అవరోధాలు వల్ల పారిస్ ఒలింపిక్స్‌లో గొప్ప గొప్ప వీరులు తయారయారు. 1896 లో ఏథెన్స్‌లో క్రీడాకారులు స్థాపించిన రికార్డులకు బదులుగా పారిస్ ఒలింపిక్స్‌లో క్రీడాకారులు క్రొత్త రికార్డులను స్థాపించారు అమెరికాకు చెందిన ఎఫ్.డబ్ల్యు. జార్విస్ 100 మీటర్ల పరుగుపందానికి 10.8 సెకండ్ల కొత్త రికార్డును స్థాపించాడు ఈ రికార్డే తిరిగి 1924 లో పారిస్ క్రీడలలో బ్రిటన్‌కు చెందిన హెరాల్డ్ అబ్రహామ్ క్రొత్త రికార్డు స్థాపించే వరకు 24 సంవత్సరాలు సుస్థిరంగా ఉంది.

అమెరికన్ ఆల్విన్ క్రేన్ జలీన్ 110 మీటర్ల హర్డిల్స్‌లో 2 సెకండ్ల తక్కువ కాలంతో మరో క్రొత్త రికార్డు స్థాపించి అందరికంటె గొప్ప యోధుడు అనిపించుకున్నాడు. లాంగ్ జంప్‌లో కూడా మూడు అడుగులు అధికంగా గెంతి క్రొత్త రికార్డును స్థాపించాడు ఇప్పుడు వాడుకలో లేని 60 మీటర్ల స్ప్రింట్ మరియు 200 మీటర్ల హర్డిల్స్‌లో కూడా రికార్డును స్థాపించాడు.

మరికొన్ని క్రీడలలో అధిగమించిన రికార్డు అంతవరకు ఏ పందాలలో కూడా కనివిని ఎరుగనివి. 1896 లో ఏథెన్స్ ఒలింపిక్స్ క్రీడలలో రాబర్ట్ గారెట్ట్ షాట్ పుట్‌లో 36 అ. 2 అం. దూరం విసిరి విజయం పొందాడు.

"ఎవరు అకుంఠిత దీక్షాపరులో వారినే విజయం వరిస్తుంది.
ఎవరు భీరువులో వారిని జీవితం హరిస్తుంది."-నెహ్రూ

1900 ఒలింపిక్ క్రీడలలో అమెరికా దేశవు రిచర్డ్ షెల్డాన్ దీనికి ఇంకా 10 అడుగులు ఎక్కువ దూరం విసరగలిగాడు

అవరోధాల వల్ల, ఆటంకాల వల్ల అసలైన వీరులు, యోధులు తయారవడానికి ఇవి మాత్రమే ఉదాహరణలు కావు. నాలుగు సంవత్సరాల తరువాత యునైటెడ్ స్టేట్స్‌లో ఒలింపిక్స్ హీనాతిహీనంగా నిర్వహించబడ్డాయి. అక్కడ ఒలింపిక్ క్రీడలు సెయింట్ లూయిస్ ఫెయిర్‌తో పాటు సెయింట్ లూయిస్‌లో నిర్వహించ బడ్డాయి. అతి సామాన్యంగా నిర్వహింపబడిన ఈ క్రీడలలో మరాథాన్ పందెంలో లోర్జ్ అనే ఒక రన్నర్ ఏమాత్రం శ్రమ లేకుండా తాజాగా కనిపించాడు అందరూ అభినందించారు. కొంత దూరం అతి వేగంగా పరుగెత్తి ఇతర రన్నర్స్‌కి కనిపించకుండా మోటారు లారీలో ముగింపుకి రెండు మైళ్ళ దూరం వరకు పోయాడు. ఈ విధంగా ఇతడు అందరినీ మోసగించి పరిహాసం చేసాడు.

ట్రాక్ చాలా మోసంగా ఉంది. సెయింట్ లూయిస్ ఫెయిర్ ప్రదర్శన శాలలు స్టేడియంలోకి కూడా వచ్చేసాయి. జన సమూహాన్ని నియంత్రించడానికి ఎటువంటి ఏర్పాట్లు జరుగ లేదు.

ఐనప్పటికీ ఈ ఒలింపిక్ క్రీడలలో ఎంతో మంది వీరులు, యోధులు తయారయారు. అమెరికా ఆర్చీ హాన్ 60, 100 మరియు 200 మీటర్ల స్ప్రింట్‌లో విజయం పొందాడు. జిమ్ లైట్‌బాడీ 800 మీటర్లు 1 నిమిషం 56 సెకండ్లలో పరిగెత్తి రికార్డు స్థాపించాడు.

అద్భుతమైన యూనివర్సిటీ ట్రాక్‌ల మీద పరిగెత్తే అలవాటు గల అమెరికన్ క్రీడాకారులు ఎట్టి హీన పరిస్థితులలో నైనా తమ నైపుణ్యాన్ని ప్రదర్శించగలమని నిరూపించారు. 1896 ఏథెన్స్ వీరులు, మరియు 1900 పారిస్ వీరులు, 1908 లో లండన్ (బ్రిటన్)లో క్రీడలను నిర్వహించారు. ఆ నాటినుంచి 1908 క్రీడలు ఒలింపిక్ క్రీడలకు మార్గదర్శక మైనాయి. ●

## ఒకే సంవత్సరంలో పుట్టిన, మరణించిన కొందరు వ్యక్తులు


Sir Winston Churchill

- *1874-1965* విన్‌స్టన్ చర్చిల్ (బ్రిటిష్ ప్రధాన మంత్రి) మరియు డబ్ల్యు. సోమర్‌సెట్ మామ్ (బ్రిటిష్ రచయిత)
- *1890-1969* డ్వైట్ డి ఐసెన్ హోవర్ (అమెరికన్ అధ్యక్షుడు) మరియు హో చి మిన్హ్ (వియత్నామీస్ అధ్యక్షుడు)
- *1898-1976* చౌ ఎన్-లై (చైనీస్ ప్రధాన మంత్రి) మరియు పాల్‌రోబ్‌సన్ (అమెరికన్ గాయకుడు మరియు నటుడు).
- *1893-1964.* సెడ్రిక్ హార్డ్ విక్ (బ్రిటిష్ నటుడు) మరియు హార్పోమార్క్స్ అమెరికన్ నటుడు మరియు మార్క్స్ సోదరులలో ఒకడు.

"మనం కోరింది మనకు లేనప్పుడు, మనకున్నదే మనం కోరుకోవడం మంచిది."

# పప్పు దినుసులు

## సొసమ్మా చాకో

పప్పు దినుసులు సామాన్యంగా బీదల పాలిటి మాంసాహారమని చెప్పుకోవచ్చు. మామూలుగా మనం తినే చిక్కుడు, బఠాణీ, మసుర మొదలైన పప్పుల పౌష్టిక విలువలు ఇతర తృణధాన్యాల విలువలతో సరిసమంగా ఉన్నా వీటిది ఒక ప్రత్యేకత. తృణధాన్యాలకు ముఖ్యంగా బియ్యపు అన్నానికి అనుబంధ పోషకాలుగా సహకరిస్తాయి.



ప్రోటీనులు (మాంసకృత్తులు) తృణ ధాన్యాలలో కంటె అన్ని పప్పు దినుసులలో అధికంగా ఉంటాయి. అనేక పప్పులలో 100 గ్రాముల భారానికి 20 గ్రాముల మాంసకృత్తులు లభిస్తాయి ముఖ్యంగా అమినో ఆసిడులు తక్కువగా ఉండటం వల్ల పప్పు దినుసులలో మాంసకృత్తుల జీవసత్తువ అధికంగా ఉండక పోయినా తృణ ధాన్యాలలో లభించని లిసిన్ (Lysine) వీటియందు పుష్కలంగా లభిస్తుంది. పప్పులు మరియు ఇతర తృణధాన్యాల మిశ్రమంలో లభించే మాంసకృత్తులు జంతు సంబంధమైన ఆహారంలో లభించే మాంస కృత్తులకు సమంగా ఉంటాయి. పప్పు దినుసులు రిబోఫ్లావిన్ తప్ప మిగిలిన అన్ని 'B' గ్రూపు విటమినులకు ముఖ్య ఆధారము

ఇతర తృణధాన్యాలలో లాగే పప్పు దినుసులలో కూడా విటమిను C లోపించినా పప్పు ధాన్యాలు మొలకెత్తేటప్పుడు వాటి యందు ఎస్కార్బిక్ ఆసిడ్ అధిక ప్రమాణంలో లభిస్తుంది

భారతదేశంలో వివిధ రకాల పప్పు ధాన్యాలు పండింపబడుతున్నాయి. వీటిలో శనగలు, మినుములు, పెసలు, కందులు చాలా ముఖ్యమైనవి. వేరుశనగలను పీనట్స్ అంటారు. ఇవి చిక్కుడు జాతి పప్పులు వంటిది. కాబట్టి వేరు శనగను కూడా పప్పు దినుసులలో చేర్చారు. వీటి పౌష్టిక విలువలు ఇతర పప్పు దినుసుల విలువలతో సమానంగా ఉన్నా వీటి యందు క్రొవ్వు పదార్థాలు అధికంగా ఉంటాయి.

సాధారణంగా పప్పులు సులభంగా జీర్ణం కావని అనుకుంటారు. శరీరానికి బలం కలిగించుకుంటూ ఆరోగ్యవంతంగా ఉండడానికి తృణధాన్యాలు లాగే ఇవి కూడా జీర్ణమై సత్తువను ఇస్తాయి. సామాన్యంగా జీర్ణకోశ సంబంధమైన కొన్ని అజీర్ణ వ్యాధుల వల్ల పప్పులు అంత సులభంగా జీర్ణం కావు.

## తరచు పాడే ఇంగ్లీషు పాట

'ఫర్ హి ఈజ్ ఎ జాలీ గుడ్ ఫెలో' అనేది తరచుగా పాడే ఇంగ్లీషు పాట. ఇది మొట్టమొదట 1981లో మాల్ బ్రూక్ (Malbrouk) అని పిలిచే ఫ్రెంచి పాట.

"తలమీద జుట్టు అందాన్నిస్తుంది. తలలోని జ్ఞానం గొప్పదనాన్నిస్తుంది."

# సుగంధ ద్రవ్యాలు మరియు మూలికలు

శారదా రామన్

వెల్లుల్లి: వంటలకు వెల్లుల్లి అనేక విధాలుగా ఉపయోగపడుతుంది వీటిని గురించి వివరంగా వ్రాయడం సులభ సాధ్యం కాదు. సామాన్యంగా అన్ని కారవు వంటకాలకు దీన్ని ఉపయోగిస్తారు. అనేక వ్యాధులకు, బాధలకు వెల్లుల్లి దివ్య ఔషధంగా పనిచేస్తుంది.

జాజికాయ మరియు జాపత్రి: రుచికి, సువాసనకి, గుణాలకి రెండూ ఒకేలా ఉన్నా ఒకదానికి బదులుగా ఇంకొక దానిని ఉపయోగించడానికి వీలులేదు. ఔషధాలలో వీటిని వాడతారు. ముఖ్యంగా జీర్ణశక్తిని అభివృద్ధి చేస్తాయి రక్తప్రవాహాన్ని ఉత్తేజపరుస్తాయి.


GARLIC

సామాన్యంగా జాపత్రి కంటె జాజికాయను తీపి పిండి వంటలలో విస్తారంగా ఉపయోగిస్తారు. ఫ్రూట్ కేక్‌లలో సామాన్యంగా రెంటినీ ఉపయోగిస్తారు. కాలిఫ్లవర్, టర్నిప్ దుంపల వంటకాలలో జాపత్రి ఉపయోగిస్తారు. సన్నగా తరిగిన జాజికాయ బంగాళ దుంపలోను, గ్రుడ్డుతో చేసే అనేక వంటకాలలోను విస్తారంగా ఉపయోగిస్తారు.

అల్లం: అల్లం కారంగా, రుచికరంగా ఉంటుంది. శరీరంలో రక్త ప్రవాహాన్ని క్రమపరచడానికి, శరీరం రంగు మార్చిడికి అల్లం ఉపయోగపడుతుంది. ముఖ్యంగా ఔషధాలలో ఉత్తేజం కల్గడానికి, జీర్ణశక్తి అభివృద్ధి చెందడానికి దీనిని వాడతారు. అనేక వంటకాలలో ఉపయోగిస్తారు. అల్లపు కేకులకు (ginger


GINGER

## పై అంతస్తుతో ప్రారంభించే భవన నిర్మాణం

పై అంతస్తుతో ప్రారంభించి భవన నిర్మాణమా? అసంభవం అని నీవు అనవచ్చు కాని న్యూయార్క్ నగరం (యు.ఎస్.ఎ)లో అదే చేస్తున్నారు మొట్ట మొదట ప్రీ ఫాబ్రికేట్ చేయబడిన అంతస్తు హైడ్రాలిక్ జాక్‌ల సహాయంతో భూతలం నుంచి పైకి స్టీలు కాంక్రీటు స్తంభం మధ్య ఆధారంగా లేవనెత్తుతారు ఈ విధంగా భవనంపై నుంచి క్రిందికి కట్టుకువస్తే డబ్బు ఖర్చు, కాలం కూడా కలసి వస్తాయని, నిర్మాణ సామాగ్రి, కూలీలు పైకి పోవలసిన అవసరం ఉండదని అంటున్నారు

"చెడు చూడకు, చెడు వినకు, చెడు మాట్లాడకు, చెడు తలవకు."

cakes), బిస్కట్లకు నూరిన అల్లం గాని, అల్లపు ఫ్లేవర్‌గాని ఉపయోగిస్తారు. కూరలకు, చట్నీలకు కూడా వాడతారు. టీకి మంచి రుచిని ఇస్తుంది. దీంతో కాండీలు, మురబ్బాలు తయారు చేయవచ్చు. ఎండబెట్టిన అల్లం శొంఠి. ఆయుర్వేదంలో శొంఠి లేని కషాయమే లేదు. ఆధునిక వైద్యంలో కూడా అల్లం అరఖు (extract) ఉపయోగిస్తారు.


PEPPER

పార్స్లే (Parsley) సాండ్విచెస్, కెనాపిస్ మరియు కారవు వంటకాలలోను వాడతారు. మంచి పరిమళంగా ఉంటుంది. ముఖ్యంగా పార్స్లే టీ టానిక్‌గా ఉపయోగపడుతుంది. శరీరం రంగు శుభ్రపడుతుంది. పార్స్లే ఆకుల మీద వేడి నీటిని వేసి 20 నిముషాలు ఉంచి డికాక్షన్ తీసి టీగా వాడతారు.

మిరియాలు: నల్ల మిరియాలు తెల్ల మిరియాల కంటె ఎక్కువ పరిమళంగా ఉంటాయి. రెండూ కారంగానే ఉంటాయి. మంచి జీర్ణకారి చాలా కాలం నిల్వ ఉండవు. తాజాగా ఉన్నప్పుడు చాలా రుచిగా ఉంటాయి.

దాల్చిన చెక్క: తియ్యగా ఉండే సుగంధ ద్రవ్యము. దీనిని అతి జాగ్రత్తగా వాడాలి. దాల్చిన పొడికంటె దాల్చిన చెక్క ఉత్తమం. పొడి కేకులలో, బిస్కట్లలో పుడ్డింగులలో ఉపయోగిస్తారు. కూరలలోను, ఇతర వంటకాల లోను కూడా ఉపయోగిస్తారు.

## ఫిల్మ్ వార్తలు

### 1909 లో రఘుపతి వెంకయ్యా టూరింగ్ సినిమా స్థాపించాడు

*రఘుపతి వెంకయ్యా (1869 - 1941) ప్రఖ్యాత ఫోటోగ్రాఫర్. ఇతడి ఫోటో స్టూడియో మద్రాసు మౌంట్ రోడ్డులో ఉండేది. 1909 లో ఇతడు టూరింగ్ సినిమాను స్థాపించాడు. దేశం అంతా తిరిగి శ్రీలంకా, మాయన్మార్ సందర్శించి దిగుమతి కావించుకున్న ఫిల్ము స్ట్రిప్పులను ప్రదర్శించాడు. తిరిగి వచ్చినప్పుడు మద్రాసులో 1913లో గెయిటీ సినిమా, 1914లో క్రౌన్ సినిమా, 1915 లో గ్లోబ్ (ఇప్పుడు రాక్సీ) సినిమాలను నిర్మించాడు.*

### సౌత్ ఇండియా నుంచి మొదటి మూకీ

*"కీచక వధ" సౌత్ ఇండియాలో తీసిన మొదటి మూకీ (Silent Film) దీనిని 1917లో నటరాజ మొదలియార్ తీసాడు.*

### మొట్టమొదటి తమిళ టాకీ – కాళిదాసు

*తమిళంలో మొట్టమొదటి టాకీ — కాళిదాసు 1931 లో ఇంపీరియల్ ఫిల్మ్ కంపెనీ వారు తీసారు. ఈ ఫిల్మును హెచ్.ఎమ్. రెడ్డి డైరెక్టు చేసాడు. టి.పి. రాజలక్ష్మి హీరోయిన్‌గా నటించిన ఈ తమిళ ఫిల్ములో పాటలు తెలుగు పాటలు.*

"వ్యక్తి శాంతియే లోకశాంతికి మార్గం."

# ఆస్ఫాల్ట్ అంటే?

వాల్టర్ కె. విల్సన్

ప్రాచీనకాలంలో భవనాలను నిర్మించేవారు నీటి చెరువులలోను, గుంటలలోను సహజంగా లభించే నల్లటి జిగట పదార్థాన్ని (Sticky Stuff) ఉపయోగించే విధానం తెలుసుకున్నారు. ఆ జిగట పదార్థాన్నే నేడు ఆస్ఫాల్ట్ (asphalt) లేక బిటుమెన్ (Bitumen) అంటారు. మెసొపొటేమియాలో సుమారు 3000 బి.సి.లో దేవాలయాలలో తొట్లలో నీరు కారకుండా ఉండటానికి దీనిని ఉపయోగించేవారు. ప్రాచీన ఈజిప్షియనులు దీనిని మమ్మీలకు ఉపయోగించేవారు కాలిఫోర్నియా ఇండియనులు పడవల చెక్కల సందుల నుంచి నీరు చొరకుండా దీనిని పూసేవారు 18వ శతాబ్దంలో ఫ్రెంచి వారు రోడ్లను, కాలిబాటలను దీంతో చదునుచేసేవారు ఈనాడు రోడ్లను చదునుచేయడానికి ఉపయోగించే ఆస్ఫాల్ట్‌కు ముఖ్య ఆధారం క్రూడ్ఆయిల్. పెట్రోలు శుద్ధీకరణలో ఈ క్రూడ్ఆయిల్ వాక్యూమ్ డిస్టిలేషన్ ప్రక్రియవల్ల ఆస్ఫాల్ట్ లభిస్తుంది ఈనాడు బ్రహ్మాండమైన మార్పులతో, అనేక బ్లెండులతో ఆస్ఫాల్ట్ విప్లవం బయలుదేరింది.

ఇప్పుడు యునైటెడ్ స్టేట్స్ పరిశోధక కేంద్రాలలో పాలిమర్స్ అనే ప్రత్యేక రసాయనిక అడిటివ్‌లతో ఉత్తమరకం ఆస్ఫాల్ట్‌ను అభివృద్ధిచేస్తున్నారు. ఆస్ఫాల్ట్ బేస్‌లో కొద్దిగా పాలిమర్‌ను కలిపితే రెండు ఫేజుల మిశ్రమం తయారవుతుంది దీనిలో ఉండే పాలిమర్ వెబ్ వల్ల ఆస్ఫాల్ట్ అమోఘంగా పనిచేస్తుంది. ఆస్ఫాల్ట్ బైండరు బాగా అంటుకునే 'ఎడ్హీసివ్' (adhesive) గుణం ఉత్తమ స్థాయిలో ఉంటుంది. అధిక ఉష్ణోగ్రతల దగ్గర గట్టితనం అధికంగా ఉంటుంది తక్కువ ఉష్ణోగ్రత దగ్గర తక్కువ బిరుసుగా ఉంటుంది. మంచి బ్లాక్ టాప్ (నల్ల) రోడ్డులో రాళ్ళు, ఇసుక మరియు 5శాతం ఆస్ఫాల్ట్ బైండరు చేరి ఉంటాయి. తయారైన రోడ్డు పైన నున్నగా ఉంటుంది. పెద్ద భార వాహకవాహనాల ఒత్తిడికి ఒక విధమైన కుషన్ (మెత్త)గా ఉంటుంది.

సాంప్రదాయకంగా రిఫైనరీలలో తయారయే ఆస్ఫాల్ట్‌ను ఆస్ఫాల్ట్ సిమెంటు అంటారు ఇదే ఇప్పటికీ రోడ్డు నిర్మాణానికి ముఖ్యమైన ఆధారం

## నటుల ఉత్తమ ప్రదర్శనలు


Charlie Chaplin

ఎమిల్ జన్నింగ్స్ : వెరైటీ
చార్లీ ఛాప్లిన్ . ది గోల్డ్ రష్
లారెన్స్ ఆలివియర్ 5వ హెన్రీ
టోషిరో మిఫ్యూన్ · రాషోమోన్
మార్లాన్ బ్రాండో . ఆన్ ది వాటర్ ఫ్రంట్

"ప్రేమయే దైవం - దైవమే ప్రేమ."

ఎప్పటికప్పుడు రహదార్లమీద కలిగే మార్పుల వల్ల ఈ ఆస్ఫాల్ట్ రోడ్లమీద అధిక ఒత్తిడి కలుగుతూంది దీనికి హైఫెర్ఫార్మెన్స్ ఆస్ఫాల్ట్ ఉంపేచాలు అత్యధిక ఉష్ణోగ్రతలవల్ల కలిగే మార్పులను, అధిక భారాలను తట్టుకోగల శక్తి దీనికి అధికంగా ఉంటుంది. ఇటువంటి హైపెర్ఫార్మెన్స్ పాలిమర్‌ను రూపొందించ డమే ఇప్పటి పరిశోధనల ముఖ్య ఆశయం.

యూరప్‌లో ఆస్ఫాల్ట్ బైండర్ మరింత గట్టిగా ఉండటానికి పునరుద్ధరింవబడిన రబ్బరును (reclaimed rubber) ఉపయోగించి ఉత్తమ ఫలితాలను పొందుతున్నారు రబ్బరైజ్డ్ ఆస్ఫాల్ట్‌లో ముఖ్యంగా ఆస్ఫాల్ట్‌తోపాటు 18శాతం అతిసున్నితమైన పాత కారు టైరులు, ట్రక్ టైరుల రబ్బరు పొడి ఉంటుంది

రబ్బరు చేర్చబడిన ఆస్ఫాల్టుకి బాగా అంటుకునే శక్తి, సంయోగ శక్తి అధికమవుతుంది. కాబట్టి పోరస్ మిశ్రమాలను సులభంగా తయారుచెయవచ్చు వీటిని "ఒపెన్ గ్రేడెడ్ డ్రెయినింగ్ కోర్సెస్" (Open-graded draining courses) అంటారు. దీనివల్ల సాంప్రదాయక మైన రోడ్డు తలం కంటే నాలుగు రెట్లు అధికంగా సూక్ష్మ రంధ్రాలతో పోరస్‌గా ఉంటుంది. దానివల్ల రోడ్డుమీద పల్లాలలో నీరు నిల్వ ఉండకుండా సూక్ష్మ రంధ్రాల ద్వారా లోపలకు ఇంకి ప్రక్క కాలవల ద్వారా ప్రవహించి పోతుంది. ఈ విధంగా ప్రవహించి పోయినప్పుడు రోడ్ల మీద మంచుపొగ ఏర్పడదు. నీళ్ళు నిలిచిఉండవు. అంతే గాకుండా వానాకాలంలో వేగంగా వచ్చే కార్లు, ట్రక్కులు, వానుల హెడ్ లైటుల కాంతి పరావర్తనం ఉండదు. కళ్ళు మిరిమిట్లు చెందవు పొడిగా ఉండే రోడ్లమీద టైరుకు పట్టు అధికంగా ఉంటుంది. కార్లకు స్కిడ్డింగ్ ఉండదు. ఈ విధంగా రోడ్ల పరిస్థితులు అభివృద్ధి పొందడమే గాక రబ్బరైజ్డ్ ఆస్ఫాల్ట్ వల్ల రెండు ముఖ్య ఇతర లాభాలు కూడా లభిస్తున్నాయి. ఒకటి పాత ఆటోమోబైల్ టైరులు, అరిగిపోయిన ట్రక్కు టైరులు తిరిగి ఉపయోగ పడుతున్నాయి. శబ్ద కాలుష్యం తగ్గుతుంది. ప్రతి మైలు రబ్బరైజ్డ్ ఆస్ఫాల్ట్ రోడ్డుకి, 1,000కి పైబడిన పాత టైరులు ఉపయోగింపబడుతున్నాయి.

లాంప్' సౌజన్యంతో

## వివాహం చేసుకోని సుప్రసిద్ధ తాత్త్వికులు




*ప్లాటో (427 - 347 బి.సి.) - గ్రీకు.*
*థామస్ హెబ్స్ (1588 - 1679) - బ్రిటిష్*
*జాన్ లాకే (1632-1704) - బ్రిటిష్*
*వోల్టేర్ (1694-1778) - ఫ్రెంచి*
*ఇమ్మాన్యుయెల్ కాంట్ (1724-1804) - జర్మన్*
*జార్జి శాంటాయన (1863 - 1952) - స్పానిష్ అమెరికన్*
*జీన్‌పాల్ సార్త్రె (1905 - 1980) - ఫ్రెంచి*

"ప్రభువు ముందు మోకరిల్లే పెద్ద మనిషి కన్నా హలం పట్టి పొలం దున్నే హాలికుడే గొప్ప."

# మీకు తెలుసా?

## రైనోసిరస్ గర్భకాలం



దళసరి చర్మంగల పెద్ద జంతువు రైనోసిరస్ గర్భధారణకాలం 560 రోజులు.

## అంతరిక్షనౌకను వదలిన మొట్టమొదటి నావికుడు

మార్చి 1965లో లియోనోవ్ అనే సోవియెట్ అంతరిక్ష నావికుడు అంతరిక్ష నౌకనువదలి అంతరిక్షం శూన్య ప్రదేశంలో తేలిన మొదటి వ్యక్తి.

## ఇంగ్లండు మరియు అమెరికాల చివరియుద్ధం

ఇంగ్లండు మరియు అమెరికాల మధ్య చివరి యుద్ధం 1815 జనవరి 8న జరిగింది.

## ప్రపంచపు మహాసముద్రాలలో లభించే యురేనియం

ప్రపంచపు మహాసముద్రాలలో 5,000 మిలియన్ టన్నుల యురేనియం లభిస్తుందని జపాన్‌లో వైజ్ఞానిక శాస్త్రవేత్తల అంచనా

## బ్రహ్మాండమైన తూగుడు గంట

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ కొలోన్ (Cologne)లో గంట స్తంభం లో 500 cwtలకు పైగా భారవంతమైన పీటర్ బెల్ ప్రపంచంలో బ్రహ్మాండమైన తూగుడు గంట. ఇక్కడ చర్చి నిర్మాణం 1880లో పూర్తి కావింపబడింది

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద వాల్ట్

ప్రపంచంలో మిక్కిలి పెద్ద వాల్ట్ (Vault)- న్యూయార్క్ (యుఎస్ఎ)లో చేస్ మాన్‌హట్టాన్ (Chase Manhattan) బాంక్‌లో ఉంది. దీనికి పెద్దపెద్ద ఆరు తలుపులు ఉంటాయి. ఒక్కొక్కటి ఎనిమిది ఏనుగులంత బరువు ఉంటుంది

## అస్సాన్‌కా అంటే?

శ్రీలంకా వారి సిన్హలీస్ భాషలో మిక్కిలి చిన్నమాట ''అస్సాన్‌కా' (Assanka) అంటే 1 తరువాత 63 సున్నాలుగల సంఖ్య

## ఉప్పు నీటిలో పెరిగే చెట్టు

మాన్‌గ్రోవ్ (Mangrove) ఒక్కటే ఉప్పు నీటిలో పెరిగే వృక్షం. ఈ వృక్షం సాధారణంగా అధిక ఉష్ణ ప్రదేశాలలో బురద గట్ల మీద, నదుల గట్ల మీద పెరుగుతుంది.

## 2 మీటర్లు గెంతే టార్సియర్

సాధారణంగా చిన్న ఎలుక పరిమాణంలో ఉండే టార్సియర్ (Tarsier) ఒక చెట్టు నుంచి మరో చెట్టుకి దూకేటప్పుడు ఒక్కొక్కసారి

"దుఃఖాన్నైనా ధైర్యంతో ఓర్చుకునేదే నీ నిగ్రహం."

అమాంతం 2 మీటర్ల దూరం గెంతుతుంది. ఆసియా దేశపు ఆగ్నేయ దిక్కు అడవులలో ఈ చిన్న జంతువు కనిపిస్తుంది.

## మిక్కిలి పెద్ద వడగల్లు

1928సం.లో యునైటెడ్ స్టేట్స్ నెబ్రాస్కాలో పడిన వడగల్లు మిక్కిలి పెద్దది. 1 1/2 పౌండ్లు తూగే ఈ వడగల్లు 17 అంగుళాలు గుండ్రంగా ఉంది.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద మెట్ల వరుస

ప్రపంచంలో మిక్కిలి పెద్ద మెట్ల వరుస (Stair Case)కి మొత్తం 11,674 మెట్లున్నాయి. వీటిమీద 2365 మీటర్ల పైకి ఎక్కవచ్చు. దీనిని మధ్య యూరప్ స్విట్జర్లాండ్‌లో నీయిసేన్ భాన్ (Niesen Bahn)లో చూడవచ్చు.

## హాండ్ లాంగ్వేజ్ స్కూలు 18వ శతాబ్దంలో ప్రారంభింపబడింది

మూగ మరియు చెవిటివారికి ఒక ఫ్రెంచి మతగురువు మొట్టమొదట చేతి సైగల (hand signs) భాష కనిపెట్టాడు. ఈ "హాండ్ లాంగ్వేజి" నేర్పించడానికి ఇతడు 18వ శతాబ్దంలో ఒక పాఠశాలను ప్రారంభించాడు.

## రాయల్ పాయిన్ సియానా ఉష్ణమండలపు వృక్షం

రాయల్ పాయిన్ సియానా (Royal Poin Ciana) ఒక ఉష్ణమండలపు వృక్షం. ఇది చిగిరించి ఆకులు రావడానికి ముందుగానే పూతపూస్తుంది.

## స్విట్జర్లాండ్‌లో నమ్మేలు తక్కువ

ప్రపంచ ప్రజాపాలిత రాజ్యాలలో స్విట్జర్లాండ్‌లో మాత్రమే నమ్మేలు చాలా తక్కువ.

## ఐర్లాండ్ ప్రజలు అధికంగా టీ త్రాగుతారు

ఐర్లాండ్ (ఈరీ) దేశపు ప్రజలు తలసరి ఇతర దేశాలలో ప్రజలకంటే అధికంగా టీ త్రాగుతారు.

## వేగంగా ఎగిరేచేప

సెయిల్ ఫిష్ అనే చేప ఒక్కటే గంటకు సుమారు 70 మైళ్ళు వేగంతో ఎగురుతుంది.

●

## పైథాన్ ప్రాణాంతకమైనది



పైథాన్ (కొండచిలువ) ప్రాణాంతకమైనది. ఇది ఒక మనిషి గుండె చుట్టూ చుట్టుకొని గట్టిగా అదిమి వట్టి నొక్కేసి చంపేస్తుంది కొండచిలువ వందిని తిన్నప్పుడు కొండ చిలువ పొట్ట తలకంటే లావుగా కనిపిస్తుంది. పెద్ద పెద్ద జంతువులను సాధారణంగా కొండ చిలువలు మింగేస్తాయి.

"ప్రశ్న అడిగినవాని చేతనే సమాధానం చెప్పించటం సనాతన బోధనా పద్ధతి."

# ఉష్ణసముద్రాలలోనే స్పాంజ్‌లు

స్పాంజ్‌లు స్పాంజ్‌ల అస్థి పంజరాలు. స్పాంజ్‌లనుంచి వచ్చే అస్థిపంజరాలు నీటి జంతువులవి అవి బాగా అభివృద్ధి పొంది నది కావు. వాటికి తల, తోక ఉండవు మెదడు ఉండదు. జరరకోశంగాని, ఊపిరితిత్తులు గాని ఉండవు. కాళ్లు, రెక్కలు, ఫిన్స్ ఉండవు. అవి వాటి జీవితాంతం ఒకే చోట ఉంటాయి. అవి జంతుజాలానికి చెందినవని శాస్త్రజ్ఞులు ఇటీవల వరకు తెలుసుకోలేక పోవడం ఆశ్చర్యం కాదు.

వందలకొద్దీ రకాల స్పాంజ్‌లు ఉన్నాయి. అవి ప్రాణంతో జీవిస్తున్నప్పుడు వివిధ రంగు లలో, వివిధ ఆకారాలలో, వివిధ పరిమాణా లలో ఉంటాయి. వాటిలో అన్నిటికీ అస్థి పంజరాలు ఉండవు మనం కొనే స్పాంజ్‌లు లాగా కొన్నిటికి చాలా నున్నటి అస్థి పంజరాలు, మరికొన్నిటికి సుద్ద (Chalk) అస్థి పంజరాలు ఉంటాయి.

ఇవి పైకి చాలా సామాన్యంగా కనిపించినా వాటికి తినడానికి తిండి, పీల్చడానికి ప్రాణ వాయువు ఉండాలి. వాటి శరీరాల మీద సూక్ష్మ రంధ్రాలుంటాయి నీరు ఈ రంధ్రాలను చేరేటప్పుడు ప్రాణవాయువుని, చిన్న చిన్న మొక్కలను తీసుకువస్తుంది నీరు పెద్ద రంధ్రాల గుండా కారిపోతుంది.

క్రొత్త క్రొత్త స్పాంజ్‌లు గ్రుడ్ల నుంచి రావచ్చు. స్పాంజ్ గ్రుడ్లు పెరిగినప్పుడు చిన్న జంతువు కొన్సేపు నీటిలో ఈదుతుంది. ఆ తరువాత గుల్ల మీదో, రాతి మీదో చేరుతుంది. అక్కడే అది జీవితం గడుపుతుంది.

స్పాంజ్‌లు అన్నీ గ్రుడ్లు నుంచి రావు. పాతదాని నుంచి ఒక క్రొత్త స్పాంజి విడిపోయి ఏర్పడవచ్చు. లేకపోతే తెగిపోయిన ఒక స్పాంజ్ భాగము అభివృద్ధి పొందవచ్చు

కొన్ని రకాల స్పాంజ్‌లు మంచి నీటిలో బయల్దుదేరినా, చాలా మటుకు స్పాంజ్‌లు ఉష్ణ సముద్రాలలోనే బయలుదేరుతాయి.

●

## ప్రపంచంలో మార్పులు తెచ్చిన గ్రంథాలు



ISAAC NEWTON

| | |
|---|---|
| ది ప్రిన్స్ | : మాకియవెల్లి |
| ప్రిన్సిపియా | : సర్ ఐజాక్ న్యూటన్ |
| కామన్‌సెన్స్ | : థామస్ పెయిన్ |
| వెల్త్ ఆఫ్ నేషన్స్ | : ఆడమ్ స్మిత్ |
| ఆరిజిన్ ఆఫ్ స్పీసీస్ | : చార్లెస్ డార్విన్ |
| దాస్ కాపిటల్ | : కార్ల్ మార్క్స్ |
| రిలెటివిటీ | : ఆల్బర్ట్ ఐన్‌స్టైన్ |

"మాయలోనే పుట్టి, మాయలోనే పెరిగి, మాయలోనే మనడం మనిషి నీతి."

# త్రాగుడుకి మూలం

ప్రాచీన కాలంలో భారతదేశంలో త్రాగుడు నిషేధింపబడినా చాలా మంది ఆనాడు కూడా వైన్ (ద్రాక్ష సారా) త్రాగేవారు. మధ్య ఆసియా గడ్డిమైదాన ప్రదేశాల (Grass Lands) నుంచి వచ్చిన శ్వేతజాతి ఆర్యులు తప్పత్రాగేవారు. అదే విధంగా పశ్చిమ ఆసియా నుంచి వచ్చి భారత దేశంపై దండెత్తిన హూణులు కూడా



త్రాగేవారు. నెగ్రిటోలు, ప్రోటోఆస్ట్రలాయిడులు, కొలేరియనులు, ద్రావిడులు మరియు ఇతర ఆదిమవాసులు కల్లు త్రాగడమే గాకుండా పూజించే దేవతలకు కూడా కల్లు నైవేద్యం చేసేవారు.

మధ్య అమెరికా మెక్సికనులు మరియు దక్షిణ అమెరికా పెరూవియనులు ఆక్టిలీ (octli) అనే మత్తు కలిగించే మొక్కను పూజించేవారు. భారతదేశపు ఆర్యులు యజ్ఞయాగాదులలో సోమలతను తప్పని సరిగా పూజించేవారు. సోమ రసం తాగితే ఎంతో సుఖం కలుగుతుందని ఆనాటి జనుల విశ్వాసం. సోమ లతను దేవతగా పూజించేవారు. దీనివల్ల అమరత్వం సిద్ధిస్తుందని వారు నమ్మేవారు పాము విషం నుంచి సుధను, బియ్యం, బార్లీ ఇతర పువ్వుల నుంచి సురా మొదలైన ఇతర పానీయాలను తయారుచేసేవారు. ముఖ్యంగా బార్లీతో తయారు చేసుకునే "కుహుల్" (Kuhul) ను కూడా ఆనాడు జనం త్రాగేవారు.

ఆయుర్వేదం ప్రకారం ద్రాక్షసారా మితంగా త్రాగితే టానిక్‌గా పని చేసి ఆరోగ్యం చేకూరుతుంది. ప్రాచీన సుప్రసిద్ధ భారత వైద్యుడు ధన్వంతరి ద్రాక్ష సారాను "అమృతం" (Elixir Of Life) అని చెప్పాడు. మరో సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు చరకుడు దాక్ష సారా బాధను నివారించుకోడానికి, ఒత్తిడిని తగ్గించుకోడానికి ఔషధం అని వివరించాడు.

మౌర్యుల కాలంలోను మరియు గుప్తుల కాలంలోను సారా త్రాగేవారు. అజంతా కుడ్య చిత్రాలలో సారా త్రాగుతూన్న చిత్రాలు ఉన్నాయి. దక్షిణ భారతంలో వివిధ వంశపు రాజులు, చక్రవర్తులు, రోము మరియు ఇతర దూర ప్రదేశాల నుంచి ద్రాక్షసారా తెప్పించుకునేవారు సామాన్య ప్రజలు కల్లు త్రాగేవారు.

ఎ.డి. 7వ శతాబ్దంలో భారత దేశానికి వచ్చిన చైనా యాత్రికుడు హుయాన్ - ట్సాంగ్ ఆనాడు సామాన్యులు రకరకాల సారాను, కల్లును త్రాగేవారని వర్ణించాడు.

## కుజగ్రహం మీద మొట్టమొదటి దిగినది

కుజగ్రహం మీద మొట్టమొదట యు ఎస్ ఎస్ ఆర్ మార్స్ 3, 1972 డిసెంబరులో దిగింది. కుజ గ్రహంలోకి పంపబడిన కాప్స్యూల్స్ (Capsule) 20 సెకండ్లు మాత్రమే సిగ్నల్స్ పంపింది.

"కోపం తాత్కాలిక ఉన్మాదం."

# 10,000 రకాల ఆపిల్ పళ్ళు

ఆపిల్ ఉత్తరంగా స్వీడెన్ (యూరప్) మరియు దక్షిణంగా అర్జెంటినా (దక్షిణ అమెరికా)లలో విస్తారంగా పండుతుంది. ఉష్ణోగ్రతలో ఎక్కువ మార్పులను ఇది తట్టుకో గలదు. ప్రపంచం అంతటా 10,000 రకాల ఆపిల్ పళ్ళు పండుతున్నాయి. వాటిలో 7,000 రకాలు ప్రపంచంలో ముఖ్యంగా




ఆపిల్ పండించే యునైటెడ్ స్టేట్స్‌లో పండింపబడుతున్నాయి.

ఈ పండ్లు సాధారణంగా చిన్న నిగనిగలాడే "క్రాబ్ ఆపిల్" నుంచి పెద్ద వుల్లని కుకింగ్ మరియు తియ్యని "డెజర్ట్" ఆపిల్ వరకు అనేక పరిమాణాలలో ఉంటాయి. పసుపువచ్చ, ఆకు పచ్చ, రోజారంగు మరియు ఎరుపు రంగులలో ఉంటాయి. బైబిల్‌లో "విజ్ఞానవృక్షం" (Tree of Knowledge) ఆపిల్ కాయలు కాస్తుంది అని చెప్పబడింది. గ్రీకు పురాణగాథలలో ఆసియా మైనర్‌లో ట్రాయ్ విధ్వంసానికి ఆపిల్ ముఖ్య కారణం అని వివరింపబడింది.

ప్రాచీన కాలంలో ఆపిల్ వృక్షం రోమన్ సామ్రాజ్యం అంతా పాకిపోయింది. 1620 దశాబ్దంలో వలస వచ్చిన ఆంగ్లేయులు దీనిని అమెరికాలో ప్రవేశపెట్టారు క్రమక్రమంగా ఆపిల్ అమెరికాలో తూర్పు నుంచి ఉత్తరానికి వచ్చి దేశం అంతా పాకిపోయింది కొంత కాలానికి తీర ప్రదేశాలలో క్రొత్త క్రొత్త ఆపిల్స్‌ను అభివృద్ధి చేయడం ప్రారంభించారు

భారతదేశంలో ఉత్తమ రకం ఆపిల్ పండ్లు కులు, హిమాచల్ ప్రదేశ్‌లో కాంగ్రా లోయల్లు, కాశ్మీరు, శిక్కిం, మరియు అరుణాచల్‌ప్రదేశ్‌లో పండింపబడుతున్నాయి

ఆహారంతో పాటు ఆపిల్ తినడంవల్ల మలబద్ధకం ఉండదు. ఆమ్లాలను తగ్గిస్తుంది. చలవ చేస్తుంది. ఆరోగ్యాభివృద్ధికి సహకరిస్తుంది. సక్రమంగా ఆపిల్ తింటూంటే అనేక వ్యాధులు తగ్గిపోతాయి. చంటి పిల్లలకు బాగా పండిన ఆపిల్ తినిపిస్తే వారు ఆరోగ్యవంతంగా పెరుగుతారు. రోజుకు ఒక ఆపిల్ తింటూంటే వైద్యుని అవసరం ఉండదని అంటారు.

## యు.ఎస్.ఎ.లో ప్రతి సంవత్సరం 50,070 గ్రంధాలు పబ్లిష్ అవుతున్నాయి

యు.ఎస్.ఎ.లో ప్రతి సంవత్సరం సగటున *50,070 గ్రంధాలు అచ్చు కావింపబడుతున్నాయి. సగటున ప్రతీది 33,000 కాపీలు చొప్పున మొత్తం 1,652 మిలియను గ్రంధాలు అచ్చు అవుతున్నాయి.*

('యునెస్కో ఫీచర్స్' సౌజన్యంతో)

"ఉత్సాహంతో చేసే పనే ధ్యానం."

# అవార్డులు

## డా.ఎమ్.ఎస్. స్వామినాథన్‌కి 1991 టైలర్ బహుమానం

*పర్యావరణ విజ్ఞాన శాస్త్రం మరియు నాయకత్వానికి ఏర్పాటైన 1,50,000 డాలర్ల (సుమారు రూ 29 లక్షలు విలువ గల 1991 సం.పు గౌరవ ప్రదమైన టైలర్ బహుమానం భారత దేశంలో హరిత విప్లవానికి మార్గ దర్శకుడైన డా ఎమ్.ఎస్. స్వామినాథన్‌కి మరియు యు.ఎస్.ఎ.లో ధూమపాన నిషేధ విప్లవానికి తండ్రివంటి వారు డా సి.ఎవరెట్ కూప్‌కు లభించింది.*

## నెక్ చంద్‌కి స్విస్ రోలెక్స్ హానరబుల్ మెన్షన్ అవార్డు

*చండీఘర్‌లో ప్రపంచ సుప్రసిద్ధమైన రాక్ గార్డెన్‌ను సృష్టించిన నెక్ చంద్‌కి మిక్కిలి గౌరవ ప్రదమైన 1990 సం.పు స్విస్ రోలెక్స్ హానరబుల్ మెన్షన్ అవార్డు లభించింది*

## డా. దారాబ్.కె. దస్తూర్‌కి 1990 ఆర్.డి.బిర్లా అవార్డు

*వైద్య రంగంలో క్లినికల్ మరియు ఎక్స్‌పెరిమెంటల్ న్యూరో పాథాలజీలో నిపుణులుగా ప్రపంచం గుర్తించిన డా. దారాబ్ కె దస్తూర్‌కి 1990 సం.పు ఆర్.డి.బిర్లా అవార్డు లభించింది. రూ. 1 లక్ష విలువ చేసే బహుమానం మరియు సన్మాన పత్రం వైద్య మరియు వైద్య సంబంధ రంగంలో దేశంలో సుప్రసిద్ధ పరిశోధనకు ఇవ్వబడుతుంది.*

## కర్నాటక ఆంటిబయోటిక్స్‌కి శ్రేష్ఠతకు IDMA అవార్డు

బెంగళూరులో గల ది కర్నాటక అంటీబయోటిక్స్ అండ్ ఫార్మస్యూటికల్స్ వారికి ఇండియన్ డ్రగ్ మాన్యుఫాక్చర్స్ అసోసియేషన్ విశిష్ఠతకు అవార్డు ఇచ్చారు.

## పి.యస్.డియోధర్‌కు యు.ఎస్.అవార్డు

ఎలక్ట్రానిక్స్ కమీషన్ అండ్ ఎలక్ట్రానిక్స్ ట్రేడ్ అండ్ టెక్నాలజీ కార్పొరేషన్ మాజీ ఛైర్మెన్ పి.ఎస్. డియోధర్‌కి యునైటెడ్ స్టేట్స్ ప్రఖ్యాత అవార్డు "ఇంజనీరింగ్ మానేజర్ ఫర్ ది ఇయర్ 1990" లభించింది ఇతడే ఈ గౌరవం పొందడానికి మొదటి భారతీయుడు

## ప్రొ. గోవింద్‌స్వరూప్‌కి బిర్లా బహుమానం

*1963 లో ఊటీ రేడియో టెలిస్కోప్ కనిపెట్టిన ప్రఖ్యాత ఖగోళ భౌతిక శాస్త్రజ్ఞుడు ప్రొ గోవింద్ స్వరూప్‌కి 1990 'రామేశ్వర్ దాస్‌జీ బిర్లా అవార్డు' లభించింది*

●

## లోకం తీరు

*లోకంలో కొంతమంది తీరిక లేకుండా పనితో ప్రాకులాడుతూంటారు. కొంతమంది పనిచేయకుండా తప్పించుకు తిరుగుతారు. ప్రపంచంలో రెండు విధాల మనుష్యులు ఉన్నారు పనిచేసేవారు ఒకరైతే గుర్తింపు ఇంకొకరికి దక్కుతుంది. మొదటి తరగతికి చెందడానికి ప్రయత్నించు పోటీ తక్కువగా ఉంటుంది.*

"సమస్య కష్టమైనదని చెప్పకు - కష్టం లేకపోతే అది సమస్యే అవదు."

# విజ్ఞాన దీపిక

## పగోడా అంటే?

పగోడా(Pagoda) ముఖ్యంగా మాయన్మార్ (బర్మా), మలేసియా, చైనా, జపాను మరియు భారత దేశంలో కనిపించే బౌద్ధ దేవాలయం సాధారణంగా దీనికి అనేక అంతస్తులు ఉంటాయి. ప్రతి అంతస్తుకిపైన పైకప్పు వ్రేలాడు తూంటుంది. చైనాలోగల 334 అడుగుల ఎత్తైన సిక్స్ హార్మనీస్ (Six Harmonies) పగోడా ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన పగోడా. 1761లో ఇంగ్లండులో నిర్మింపబడిన చైనీస్ శైలి పగోడా 160 అడుగులు ఎత్తుగా ఉంటుంది

## "క్విస్లింగ్" పదం ఉత్పత్తి

'క్విస్లింగ్' (Quisling) అనే పదం నార్వేకు చెందిన విడ్కుం క్విస్లింగ్ అనే పేరు నుండి ఏర్పడింది. 1931-1933 సంవత్సరాల మధ్య ఇతడు నార్వే రక్షణ మంత్రి. రెండవ ప్రపంచ యుద్ధంలో నార్వేని జర్మనీ వశం చేసుకున్నప్పుడు ఇతడు అడోల్ఫ్ హిట్లర్‌తో చేరి 1940లో ముఖ్యమంత్రిగా ప్రకటించుకున్నాడు. క్విస్లింగ్ అనే పదానికి రాజద్రోహి అనే అదే అర్థం ఏర్పడింది. యుద్ధానంతరం ఇతడు శిక్షింపబడి ఉరిదీయబడ్డాడు.

## రాకాసి వృక్షం 4,000 సం.లు జీవిస్తుంది!

సుమారు 100 మీటర్లు ఎత్తుగా పెరిగే సెక్వోయా(sequoia) రాకాసి వృక్షం కాండం కైవారం 10 మీటర్లు ఉంటుంది దీనిని మంటలు కాల్చలేవు. ఇది 4,000 సంవత్సరాలు జీవిస్తుంది. దీని కలప 5 గదుల ఇళ్ళు 40 నిర్మించడానికి సరిపోతుంది ఇది యు.ఎస్.ఎస్.ఆర్ కాకాసస్ (Caucasus) ప్రదేశంలో పెరుగుతుంది.

## ఇగ్లూలను గంటలో నిర్మిస్తారు

ఉత్తర అమెరికాకు దూరంగా ఉత్తర ప్రదేశాలలో నివసించే ఎస్కిమోలు శీత కాలంలో ఇగ్లూ, అనే మంచు గుడిసెలలో జీవిస్తారు. 4 అంగుళాల దళసరి, 2 అడుగుల పొడవు గల మంచు గడ్డలను డోము ఆకారంలో కోస్తారు పగుళ్ళను మంచుతో పూస్తారు వీటిని నిర్మించుకోడానికి ఒకే ఒక గంట పడుతుంది.

## ఒకే చెట్టు మీద 70 వీవర్ పక్షులు నివసిస్తాయి


BAYA (WEAVER BIRD)

*వీవర్ బర్డ్స్ అనే బంగారు పిచ్చుకలు సీసాల వంటి గూళ్ళు కట్టుకుంటాయి. సుమారు 70 పక్షులు ఒకే చెట్టును ఆశ్రయించి ఉంటాయి. ప్రతీ కొమ్మ నుంచి ఈ గూళ్ళు సీసాలలాగ వ్రేలాడు తుంటాయి. చిన్న చిన్న మొక్కలు, గడ్డి చేర్చి ఈ గూళ్ళను నిర్మించుకుంటాయి. గూడుకి క్రింద ఉండే ద్వారం ద్వారా ఇవి లోపలికి ప్రవేశిస్తాయి.*

"అంతా, పోయినా భవిష్యత్తు ఇంకా మిగిలి ఉంటుంది."

# అక్కడా - ఇక్కడా

## పరిసరాలను కాలుష్యం చేయడం శిక్షింపదగిన నేరం

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (UAE) దుబాయ్‌లో పరిసరాలను కాలుష్యం చేయడం శిక్షింపదగిన నేరం. కాలుష్య ప్రదేశాన్ని శుభ్రం చేయడానికి అయిన ఖర్చులను అపరాధి చెల్లించాలి. ఆరుబయట ప్రదేశాలలోగాని, సముద్రంలోగాని తుక్కు, నూనెవేయడం, మరియు నిర్దేశింపబడిన ప్రదేశాలలో తప్ప ఇతర చోట్ల వాటిని వేయడం నేరం అవుతుంది.

## 102 కారట్ల వజ్రానికి రికార్డు ధర లభించింది

ఇంతవరకు విక్రయించబడిన వాటిలో మిక్కిలి పెద్ద వజ్రం 102 కారట్ల వజ్రానికి ఒక వేలంలో రికార్డు ధర - 12.8 మిలియను డాలర్లు లభించింది. బేరి పండు ఆకారంలో ఉండే 1.4 అంగుళాల ఈ వజ్రం టవర్ ఆఫ్ లండన్‌లో బ్రిటిష్ క్రౌన్ ఆభరణాలతో పాటు ఉంచిన ప్రపంచ ప్రసిద్ధి పొందిన 'కోహినూరు' కంటె ఏడు కారట్లు తక్కువ.

## ఒకే ఒక స్టాంపుకి ప్రపంచ రికార్డు ధర

135 సంవత్సరాలకు పూర్వం రెండు సెంట్లకు అమ్మిన లేడీ మాక్‌గిల్ అనే యునైటెడ్ స్టేట్స్ స్టాంపుకి వేలంలో 1.1 మిలియను డాలర్లు - ప్రపంచ రికార్డు ధర లభించింది. ఈ స్టాంపును ఒక జపాను బాంక్ కొనుక్కుంది. ఇంతకు పూర్వం 1985లో ఒకే స్టాంపుకు బ్రిటిష్ గుయానా 1 సెంట్ (One - cent Magenta) మజెంతాకు లభించిన ప్రపంచ రికార్డు ధర 935,000 డాలర్లు.

## భారతదేశంలో పూర్తి అక్షరాస్యత గల జిల్లా

భారతదేశంలో కేరళలో ఎర్నాకులం జిల్లా 100కి 100 అక్షరాస్యతగల జిల్లాగా ప్రసిద్ధి పొందింది. "ఆపరేషన్ ఫ్లడ్‌లైట్" ఉద్యమం క్రింద 1,80,000కి పైబడిన నిరక్షరాస్యులకు చదవడం, వ్రాయడం నేర్పబడింది.

## అదుపు లేని కలం



*జర్నలిజం ముఖ్య ఆశయం సేవ. న్యూస్ పేపర్ (ప్రెస్) ఒక బ్రహ్మాండమైన శక్తి. అదుపులేని నీటి ప్రవాహం పంటలను నాశనం చేసి ఊరుని ముంచేసినట్లు అదుపులేని కలం కూడా సర్వ నాశనానికి కారణం అవుతుంది.*

— మహాత్మాగాంధీ

"సంకల్పాన్ని త్యజించే వాడు ఎవడూ కర్మయోగి కానేరడు."

# ప్రపంచంలో ఏడు వింతలు

ఈజిప్టు పిరమిడులు: బ్రహ్మాండమైన రాతి నిర్మాణాలు, సమచతురాకారపు పీఠము, త్రికోణాకారపు ముఖతలాలు ఉంటాయి. వీటిని



ఈజిప్టు చక్రవర్తుల సమాధులుగా నిర్మించారు ఈ పిరమిడుల నిర్మాణ కాలం 2700-2300 BC. గిజా (Giza)లో గల సుప్రసిద్ధ స్మారక నిర్మాణాలలో ఖుఫు (cheops) పిరమిడ్లు కూడా ఉన్నాయి.

బాబిలాన్ హాంగింగ్ గార్డెన్స్: డాబాల మీద తోటలను 2వ నెబుచాడ్‌నెజార్ (Nebuchad-



nezzar - II 562 BC) నిర్మించాడు. పై డాబామీద ఉండే నీటి నిల్వ తొట్టి నుండి వీటికి నీటిని పెడతారు. ఇవి పశ్చిమ ఆసియా ఇరాక్‌లో బాగ్దాదుకి దక్షిణంగా 96 కి.మీ.ల దూరంగా ఉన్నాయి.

## ఇంటి సలహాలు

### బాల్‌పాయింట్ పెన్ వ్రాయడం లేదూ?

*మీ బాల్‌పాయింట్ పెన్ లోపల సిరా ఉన్నా అకస్మాత్తుగా వ్రాయడం నిలిచిపోతే పాయింటును గాజువలక మీద మెల్లిగా రుద్ది చూడండి.*

* * *

### సెలోఫెన్ టేప్ కొసలు అతుక్కుపోతే

*సెలోఫెన్ టేప్ కొసలు అతుక్కుపోతే ఆ చుట్టను రెఫ్రిజరేటర్‌లో 10 నిమిషాలు పెట్టి ఉంచండి. కొన దానంతట అదే పైకి వస్తుంది*

* * *

### పార్సిల్ కట్టేటప్పుడు గట్టిగా ఉండాలంటే

*పార్సిల్ కట్టు గట్టిగా ఉండాలంటే తాడును కట్టేముందు వేడినీటిలో పెట్టి తీయండి. బాగా ఆరినప్పుడు అది కుదించుకుపోయి దానంతట బాగా గట్టిపడిపోతుంది.*

* * *

### మరకలు పోవాలంటే?

*బ్రౌన్ లెదర్ మాలమీద మరకలు పోవాలంటే అరటిపండు తొక్క లోపలి వైపుతో రుద్ది ఆ తరువాత శుభ్రమైన గుడ్డతో తుడిచి పాలిష్ చేయాలి.*

"చంచలమైన మనస్సును అభ్యాస వైరాగ్యాల చేత నిగ్రహింపవచ్చు."

మాసోలస్ టూంబ్: సుమారు 350 బి.సిలో కేరియా మాసోలస్ చక్రవర్తి జ్ఞాపకార్థం అతడి



భార్య ఆర్టిమిసియాచే టర్కీలో హెలీకార్నాస్సస్‌లో పాలరాతితో శిల్పసౌందర్యంతో నిర్మించబడింది.

ఇఫెసస్‌లో డయానా దేవాలయం: ప్రాచీన గ్రీకులు లేక అయోనియన్స్ (IONIANS)



సుమారు 350 బి.సి.లో ఏసియా మైనర్ (ఇప్పుడు టర్కీ)లో డయానా దేవత గౌరవార్థం నిర్మించారు. 262 A.D.లో గోత్‌లు - జర్మనులు దీనిని నశింపజేసారు.

రోడ్స్‌లో కోలోస్సస్: గ్రీకులు అందానికి ఆదర్శ యువకునిగా గ్రహించిన అపోలో కంచు విగ్రహం. సుమారు 280 బి.సి.లో



నిర్మించబడింది. ఇది ఏజియన్ (Aegean) సముద్రంలో రోడ్స్ ద్వీపకల్పంలోగల ఓడ రేవు దగ్గర నిర్మింపబడింది ఇది 224 బి.సి.లో సంభవించిన భూకంపంవల్ల నశించిపోయింది.

## "మొలోనీస్" మిశ్రమం

మద్రాసు కార్పొరేషన్ మాజీ కమీషనర్ మొలోనీ (Molony)ని ప్రజలు చాలా గౌరవించేవారు ఇతడే మద్రాసు నగరానికి మొట్టమొదట క్లోరిన్ కలవబడిన నీళ్లు సరఫరా చేసాడు. చాలాకాలం వరకు దీనిని "మొలోనీస్" మిశ్రమం అనేవారు. ఇతడు గొప్ప సరసుడు. ఒక పెద్ద భూకామందు ఒకరోజున "నా వంటలన్నీ మునిగిపోయాయి. ఏం చేయాలో వైరు చేయండి" అని టెలిగ్రాం ఇచ్చాడు. వెంటనే మొలోనీ "కృతిమశ్వాస ప్రయత్నించు" అని జవాబు పంపాడు!

"పాపులందరిలోను మహాపాపివైనా జ్ఞానమనే తెప్పతో అన్ని పాపాలను దాటగలవు."

జియూస్ స్టాట్యూ: సుమారు 430 బి.సి.లో పాలరాతితో కట్టి దంతము, బంగారు తాపడం పెట్టి ఫిడియా శిల్పి దీనిని నిర్మించాడు. ఇది



గ్రీసులో ప్రాచీన నగరం ఒలింపియా ఎల్లిస్ మైదానంలో నిర్మింపబడింది. జియూస్ (Zeus) ఒలింపియనుల వర్షాధిదేవత - వర్షం కురిపించి భూమిని సారవంతం చేస్తాడు.

ఫారోస్ ఆఫ్ అలెగ్జాండ్రియా: తెల్ల పాలరాతి వాచ్‌టవర్ మరియు లైట్‌హౌస్.



ఇది ఈజిప్టు అలెగ్జాండ్రియా ద్వీపకల్పంలో ఉంది. ఇది సుమారు 280 బి.సి.లో 2వ టాల్మే పర్యవేక్షణలో పూర్తి కావింపబడింది. తరువాత ఇది 14వ శతాబ్దంలో సంభవించిన గొప్ప భూకంపం వల్ల పూర్తిగా నశించి పోయింది.

●

## క్విజ్ - జవాబులు :

1 డెసిబెల్, (2) సౌర (Solar), (3) హాకీ, (4) పశ్చిమం, (5) 1957, (6) పంచదార, (7) క్రికెట్, (8) కేరళ.

## మాటల మహిమ - జవాబులు

1. (ఎ) ఎగిరిపడు, (బి) ఉలికిపడు, (సి) ఎగసిపడు.
2. (ఎ) గౌరవము, (బి) ఆదరము, (సి) దయ, (డి) అనుగ్రహము.
3. (ఎ) సౌందర్యము, (బి) విలాసము, (సి) కాంతి.
4. (ఎ) ధ్వని, (బి) చింత.
5. (ఎ) బలము, (బి) సామర్థ్యము, (సి) ధైర్యము, (డి) సాహసము.
6 (ఎ) నృత్యము.
7 (ఎ) జీవనము, (బి) వృత్తి, (సి) నడత, (డి) కాపురము.
8. (ఎ) సమానము, (బి) పొట్టిది, (సి) అల్పము.

## తెలివికి పరీక్ష - జవాబులు

1 57, (2) దిగితేగాని లోతు తెలియదు, 3 విగ్రహం మీది నగలకోసం చూస్తాడు, 4. బ్రహ్మకడిగినపాదము, 5. దుఃఖం తగ్గుతుంది, 6. ఒంటికంటి రామలింగడు.

"జ్ఞాన హీనుడు, శ్రద్ధలేనివాడు, సందేహించువాడు నష్టుడు."

# నిజాలు - నిదర్శనాలు

## ఇరాన్ - ఇరాక్ యుద్ధానికి అయిన ఖర్చు



ఎనిమిది సంవత్సరాల దీర్ఘకాలపు ఇరాన్ - ఇరాక్ యుద్ధానికి రెండు దేశాలు మిలటరీ కార్యకలాపాలకు 170-200 బిలియను డాలర్లు మరియు భారీ ఎత్తున ఆయుధాల దిగుమతికి 26 బిలియను డాలర్లు వెచ్చించారు ఇరాన్ - ఇరాక్ రెండు దేశాల మొత్తం ఖర్చు మాత్రమే వారి నూనె వనరుల ఆదాయం - 400 బిలియను డాలర్లలో సుమారు 40-50 శాతం.

(స్టాక్‌హోమ్ ఇంటర్ నేషనల్ పీస్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారి రిపోర్టు)

## ప్రీరికార్డెడ్ ఆడియో కాసెట్ల తయారీకి భారతదేశం రెండవది

ప్రీరికార్డెడ్ ఆడియో కాసెట్ల తయారీకి భారతదేశం రెండవది. సాలీనా 130 మిలియను టేపులను తయారుచేస్తూంది. సాలీనా 450 మిలియను టేపుల తయారీతో యునైటెడ్ స్టేట్స్ మొదటి దేశము. సాలీనా 110 మిలియను టేపుల తయారీతో చైనా మూడవది. ప్రస్తుతం భారత దేశపు టేప్ మార్కెట్ విలువ 188 మిలియను డాలర్లు

## భారతదేశంలో 2 లక్షల రిజిస్టర్డ్ కంపెనీలు

భారతదేశంలో రెండు లక్షల రిజిస్టర్డ్ కంపెనీలు ఉన్నాయి. వీటిలో 6,000 స్టాక్ ఎక్స్ చేంజీలలో రిజిస్టర్ కావింపబడ్డాయి. భారత దేశంలో అన్ని స్టాక్ ఎక్స్‌చేంజీలలోను మొత్తం వ్యవహారాల విలువ సాలీనా రూ 75,000 కోట్లు ఉండవచ్చు

## గిర్ వైల్డ్‌లైఫ్ సాంక్చురీలో 284 సింహాలు



గుజరాత్‌లో గిర్ వైల్డ్‌లైఫ్ సాంక్చురీలో 1974లో ఉన్న 130 సింహాల సంఖ్య 1990లో 284కి పెరిగింది.

## పాడుపడ్డ రోడ్ల రిపేరీ ఖర్చులకు 43 బిలియను డాలర్లు అవసరం

అభివృద్ధి పొందుతూన్న దేశాలలో బాగా పాడుపడిపోయిన రోడ్లకు 43 బిలియను డాలర్ల

"భయంతో దేవుని ప్రార్థించేవారు కనిపిస్తే దయ్యాన్ని కూడా ప్రార్థిస్తారు."

విలువ చేసే రిపేర్లు అవసరం. మిక్కిలి ఎక్కువగా అవసరమైన లాటిన్ అమెరికా మరియు కరేబియన్ దేశాలలో రిపేర్లకు 11 బిలియను డాలర్లు ఖర్చవుతుంది. మొత్తం 85 దేశాలలో పట్టణాలకు బయట తారు వేసిన రోడ్లలో 3వ వంతుకి, వేయని రోడ్లలో 4వ వంతుకి రిపేర్ల అవసరం ఉంది.

(వరల్డ్ బ్యాంక్ రిపోర్టు)

## రూ.231.57 కోట్ల విలువ బంగారు ఆభరణాలు ఎగుమతి చేయబడ్డాయి



భారతదేశం నుంచి 1989-90 సంవత్సరంలో ఎగుమతైన బంగారు ఆభరణాల విలువ రూ 231.57 కోట్లు. ఇవి యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, కువైట్, హాంగ్ కాంగ్, సింగపూర్, కెనడా, జపాను మరియు సౌదీ అరేబియా దేశాలకు ఎగుమతి చేయబడ్డాయి.

## భారతదేశంలో మొత్తం 147,236 పోస్టుఆఫీసులు

ఇప్పుడు భారతదేశంలో 147,236 పోస్టు ఆఫీసులు ఉన్నాయి. వీటిలో 130,987 గ్రామాలలో ఉన్నాయి. భారతదేశంలోని పోస్టల్ విధానం చాలా పెద్దది ప్రతీ 4,658 మందికి ఒక పోస్టు ఆఫీసు ఉంది

## దేశంలో రీడర్ షిప్ కేరళలో మిక్కిలి అధికం

భారతదేశంలో 21 శాతం వయోజనులు ఏదో ఒక వార్తాపత్రిక చదువుతారు. కేరళలో వార్తా పత్రికలు చదివేవారు 59 శాతం - చాలా ఎక్కువ. పెద్ద నగరాలలో బొంబాయిలో వార్తా పత్రికలు చదివేవారి సంఖ్య అధికం - 69 శాతం. పట్టణ ప్రాంతాలలో 56 శాతం, గ్రామీణ ప్రాంతాలలో 9 శాతం వార్తా పత్రికలు చదువుతారు. దేశం అంతటా దిన పత్రికలు చదివే వారిలో 3వ వంతు మహిళలు.

## భారతదేశంలో 3,50,000 కోఆపరేటివ్ సొసైటీలు

ప్రస్తుతం భారతదేశంలో రూ 480,000 మిలియను పెట్టుబడితో, 150 మిలియను మంది సభ్యులతో సుమారు 3,50,000 అన్ని రకాల కో-ఆపరేటివ్ సొసైటీలు ఉన్నాయి. ఇవి అన్నీ దేశంలో 33 శాతం ఎరువుల పంపకం, రూ. 440,000 మిలియను అప్పుల పంపకం, రూ. 40,000 మిలియను వ్యవసాయోత్పత్తుల అమ్మకం చేబడుతున్నాయి.




"స్వాభావికంగా జరిగే మంచి పనుల వల్ల మనలో అహంకారం పుట్టదు."

# విటమినుల ప్రాముఖ్యత

డా. మెర్‌వెయిన్ హార్డింగ్

విటమినులు ప్రాణులకు తప్పనిసరిగా ఉండాలి ఏ ప్రాణీ కూడా విటమినులు లేకుండా జీవించలేదు. అత్యావశ్యకమైన ఈ పోషకాంశాలు ఒకటికాని అంతకంటే ఎక్కువకాని లోపించినప్పుడు వ్యాధి పట్టుకుంటుంది. ఒక్కొక్కప్పుడు మరణం కూడా సంభవిస్తుంది.



అనేక వందల సంవత్సరాల పాటు జనం భయంకరమైన పోషక లోపం వల్ల బాధించే వ్యాధులతో బాధపడేవారు. తినే ఆహారంలో ఈ పోషకాంశాలు లోపిస్తున్నాయని తెలుసుకోలేకపోయారు. 15 మొదలు 18వ శతాబ్దంలో క్రొత్త ప్రదేశాలను వెదకడానికి బయలు దేరినప్పుడు నావికులు దూర ప్రయాణాలలో ఉప్పు మాంసం, బిస్కట్ల మీద ఆధారపడేవారు అసలు పళ్ళు, కాయగూరలు తినేవారు కాదు. ముఖ్యంగా విటమిను C (ఎస్కార్బిక్ ఆసిడ్) తక్కువ అవడం వల్ల వీరికి 'స్కర్వీ వ్యాధి' వ్యాపించి వందలాది మంది చనిపోయారు. తూర్పు తీర ప్రదేశాలలో ప్రజలు చేతితో దంపిన బియ్యానికి బదులుగా బాగా మరపట్టి తెల్లగా చేసిన బియ్యం తినడం వల్ల 'బెరిబెరి' రోగం ప్రబలి పోయింది. రోగులకు వెంటనే రోగ కారణం తెలియలేదు. పారవేసే తవుడుతో పాటు విటమిను B1(థయామిన్) పోతుంది. బియ్యం మర పట్టటం వల్ల కూడా ఇది పోతుంది. దీని లోపం వల్లనే బెరిబెరి రోగం వస్తుంది.

## నడుం కీలు బలిష్టతకు క్రొత్త పదార్థం

ఇంగ్లండు ఆగ్నేయ దిక్కుగా కేంటర్‌బరీ కెంట్ యూనివర్శిటీలో కార్బన్ మరియు హైడ్రోజన్ అణువులు ప్రత్యేక పరిస్థితులలో సంయోగం చెందగా ఏర్పడే క్రొత్త పదార్థాన్ని పరిశోధిస్తున్నారు ఇది గ్రాఫైట్ లాగా అతి మృదువుగా, మెత్తగా వంగేటట్లు ఉండి వజ్రం అంత కఠినంగా ఉంటుంది కార్బన్ హైడ్రోజన్ సమ్మేళనం మానవ శరీరంతో బాగా నప్పుకుపోతుంది. కాబట్టి క్రొత్త హార్ట్ వాల్వులు, నడుం కీలు వాల్వులకు చాలా అనువుగా ఉంటుంది ఈ క్రొత్త పదార్థం వల్ల క్రొత్త కీళ్ళ వాల్వుల జీవితం 10 సంవత్సరాలు అధికం అవుతుంది. అంతే గాకుండా దీనికి సీలుచేసే గుణం ఉంది కాబట్టి శరీరంలో ముక్కలు ముక్కలుగా విరిగి పోవడం అంటూ ఉండదు ఇంజనీరింగ్ మెషీన్ టూల్స్ తయారీకి డైమండ్‌లకు బదులుగా దీనిని ఉపయోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి అతినన్నని డైమండ్ పొర పోతకు అవసరమయే అత్యధిక ఒత్తిడి ఉష్ణోగ్రతతో పోలిస్తే ఈ క్రొత్త పదార్థాన్ని గది ఉష్ణోగ్రత దగ్గర శూన్య ప్రదేశంలో సన్నని పొరలు చేయవచ్చు

-'బ్రిటిష్ ఇన్‌ఫర్మేషన్ సర్వీసెస్' సౌజన్యంతో

"భోగం కంటె త్యాగం ఎంతోమధురం - మామిడి చెట్టు తన ఫలాలను తాను తినదు."

పశ్చిమ దేశాలలో రొట్టెల బేకరీలో, బేకరీ వస్తువులు తెల్లటి మైదా పిండితో తయారు చేస్తారు. తెల్లటి పిండి మరబట్టినప్పుడు గోధుమ మొలక (germ) నశించిపోతుంది పైన ఉండే పొట్టు సంబంధమైనవన్నీ పోతాయి ముఖ్యంగా పైన పోయే మూడవవంతు పొట్టులో రమారమి 20 పోషకాంశాలు ఉంటాయి గింజలలో ఉండే విటమినులు, ఖనిజాలు ఇందులోనే ఉంటాయి నిస్సత్తువైన ఆహారాన్ని కేవలం విటమినులు చేర్చటం వల్ల సత్తువ గల ఆహారంగా చేయలేము అంతే గాకుండా అత్యధికంగా విటమినులు తీసుకోవడం అనవసరం మాత్రమే గాక అవి విషంగా పరిణమించి తీవ్రమైన హాని కలిగించవచ్చు ముఖ్యంగా క్రొవ్వు కరిగే A,D విటమినులు తక్కువ రిఫైన్డ్ ఆహారం తింటే ఆహారంతో నీకు కావలసిన విటమినులు అన్నీ లభిస్తాయి పూర్తి గోధుమ రొట్టె, తృణ ధాన్యాలతో పాటు చిక్కుడు జాతి గింజల వల్ల విటమిను 'B' పుష్కలంగా లభిస్తుంది తాజా పళ్ళు కాయ గూరలు విటమిను 'C' ని లభింపజేస్తాయి ఇక ఆకు కూరలన్నిటిలోను ముఖ్యంగా విటమిను 'A' 'C' లభిస్తాయి ఆహార పదార్థాలలో విటమిను 'D' అంతగా లభించదు. ఇది సూర్యరశ్మి వల్ల లభిస్తుంది.

పోషకాహార వేత్తలు (Nutritionists) తినే ఆహారంలో కావలసిన విటమినులను లభింప జేసుకోమంటారు విటమినులు ఆహారంతో పాటు తీసుకుంటే ఇతర పోషకాంశాలతో పాటు అవి శరీరంలో ప్రవేశిస్తాయి. సీసాలలో విటమినులు తినడం కంటే ఇది ఎంతో మంచిది

-'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

# ప్రసిద్ధ పురుషుల చివరి మాటలు




- భారతదేశపు రాజకీయ నాయకుడు మరియు సత్యపరాయణుడు మహాత్మా గాంధీ తీవ్రవాది గాడ్సే తుపాకి గుండు తగిలినప్పుడు "హేరామ్" అన్నాడు
- సుప్రసిద్ధ ఆంగ్లేయ కవి లార్డ్ బైరన్ చివరగా "ఇక నేను పడుకోవాలి" అన్నాడు
- మొట్టమొదటి అమెరికన్ అధ్యక్షుడు, రాజ నీతిజ్ఞుడు జార్జి వాషింగ్టన్ "మరణించడం కష్టమే కాని మరణం అంటే నాకు భయం లేదు" అన్నాడు
- ప్రష్యాదేశపు చక్రవర్తి ఫ్రెడరిక్ - "శిఖరం చేరుకున్నాను, ఇక వెళ్లడం మంచిది" అన్నాడు
- ఫ్రాన్స్ దేశపు రాణి మేరీ ఆంటోయ్‌నెట్టె మరియు 16వ లూయీ రాజు భార్య ఉరిశిక్షను అనుభవించే ముందు "గుడ్ బై పిల్లలూ, నేను మీ తండ్రి దగ్గరకు వెళుతున్నాను" అంది.
- యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు నాజర్ "నాకు ప్రశాంతమైన దీర్ఘనిద్ర అవసరం" అంటూ మరణించాడు

(-లయన్ కృష్ణస్వామి సేకరణ)

"వస్తువులలో మనకు కలిగే ఆనందానికి కారణం దాని నవ్యతయే."

# చింత 200సం.లు జీవిస్తుంది

శృతి షా

భారతదేశపు గ్రామీణ జీవితంలో చింత చాలా ముఖ్యమైనది మన దేశంలో అన్ని గ్రామాల పొలి మేరలలో వీటిని చూడవచ్చు ఈ చెట్లు దట్టంగా పెరిగి కొమ్మలు విస్తరించు కుంటాయి. పిల్లలకు, పెద్దలకు కూడా మిక్కిలి ప్రియమైన వృక్షము ఇది.



చింత చెట్టు ఆఫ్రికా ఖండపు ఉష్ణ మండల ప్రదేశాలకు చెందినది భారతదేశం మరియు పాకిస్తాన్‌లకు కూడా చెందిన ఈ చెట్టు మధ్య మరియు దక్షిణ భారతంలో విస్తారంగా పెరుగుతుంది అరబ్బులు దీనిని భారతదేశంలో ప్రవేశపెట్టారు అందుకే దీనిని 'టమార్ - ఇ - హిండ్' అంటారు భారతదేశపు ఖర్జూరం అని దీనికి అర్థము. దీనిని మరాఠీలో "చించ్", గుజరాతీలో "అమ్లి", ఉర్దూ మరియు పంజాబీలో "ఇమ్లి", తమిళంలో "పుళి", తెలుగులో "చింత" అంటారు ఈ పదాలన్నీ కూడా సంస్కృతంలో "తింత్రిణీ" అంటే చింత అనే పదాన్నుంచే ఏర్పడి ఉండాలి

సుమారు 24 మీటర్లు ఎత్తుగా పెరిగే ఈ చింత చెట్టు దీర్ఘకాలం - 200 సంవత్సరాలు జీవిస్తుంది ఇది అంత శీఘ్రంగా పెరగదు వర్షాకాలానికి ముందు మరియు శీతాకాలంలోను దానికి రక్షణ అవసరం నాటిన తరువాత పది లేక పదిహేను సంవత్సరాలకు చెట్టు కాపుకు వస్తుంది. ఆ తరువాత జీవితాంతం కాపు కాస్తూనే ఉంటుంది. నీటి ఎద్దడిని బాగా తట్టుకొని ఎండపై ఆధారపడే ఈ చెట్టు మంచును ఎంత మాత్రం తట్టుకోలేదు పరిసరానుగుణ్యంగా పెరిగే ఈ చింత చెట్టును ఎటువంటి వాతావరణంలోనైనా, ఎటువంటి భూములలోనైనా ప్రవృద్ధి చేయవచ్చు

పాలిపోయిన ఆకుపచ్చని రంగు ఆకుకి పది, పన్నెండు చిన్న చిన్న లేత ఆకులు ఉంటాయి దీనివల్లే పచ్చగా, అందంగా కని పిస్తుంది పువ్వులు ఎరుపు, పసుపు రంగులో ఉంటాయి గుత్తులు, గుత్తులుగా చిన్న చిన్న రెమ్మల చివర పూవులు పూస్తాయి. ఏప్రిల్ మొదలు జూన్ నెల వరకు చెట్టు పూత మీద ఉంటుంది చింత కాయలో గింజలు విడివిడిగా లోపల ఇమిడి ఉంటాయి ప్రతి చింత కాయలో సాధారణంగా మూడు మొదలు పది గింజలు దాకా ఉంటాయి చలి కాలంలో బాగా పండుతాయి. ముఖ్యంగా పండిన చింతకాయల పులుపు, తీపి అన్ని చెట్లకు ఒకే విధంగా ఉండవు చెట్టు చెట్టుకి మారు తుంటాయి పండ్లలో గింజలు, నారు తీసిన తరువాత చింతపండు శుభ్రం చేసి ఎండ బెడతారు ఈ చింత పండుకి ఉప్పు కలిపి చాలా కాలం నిల్వ చేసుకోవచ్చు.

"ప్రవహించే సెలయేళ్ళలో సద్గ్రంథాలు లభిస్తాయి, రాయి రప్పలలో ప్రవచనాలు వినిపిస్తాయి."

చింత చెట్టు అనేక విధాలుగా ఉపయోగ పడుతుంది. చింతకాయలు, చింతచిగురు, చింత ఆకు పచ్చడికి ఉపయోగిస్తారు. చింతాకు పశువులకు మేతగా కూడా ఉపయోగిస్తారు చింతాకు నుంచి ఒక విధమైన ఎరువు రంగును తయారుచేసి దీనిని రంగు పోగొట్టడానికి బ్లీచింగ్ ఏజెంటుగా వాడతారు. చింతపండు వంటలకు, చట్నీలకు, షర్బత్తులకు ఉపయోగిస్తారు చింత గింజలు జాములు, మరియు జెల్లీల తయారీకి ఉపయోగపడుతున్నాయి.

చింత చెట్టు వివిధ భాగాలు ఔషదాలుగా కూడా వాడబడుతున్నాయి చింతాకుల రసం పట్టులు వాపులు, నొప్పులు తగ్గిస్తుంది. ముఖ్యంగా బాధాకరమైన కంజెక్టివైటిస్ (con-junctivities) వ్యాధులకు చింత పూవు రసం పట్టులు వేస్తారు.

చింతపండు విరేచనకారి దీనిని విరేచనాల మందులలో కలుపుతారు. చింతపండు కషాయం, శారు జ్వరాలకు దివ్య ఔషధం. కొన్ని కొన్ని ఔషధాలలో చింత గింజల పొడి కూడా వాడతారు.

మానవులే గాక. జంతువులు కూడా చింత పండును తింటాయి. ముఖ్యంగా కోతులు చింత పండు తిని గింజలను పారేస్తూంటాయి. ఈ విధంగా దీనికి బీజవ్యాప్తి జరుగుతుంది, నిరంతరం వంశాభివృద్ధి కూడా జరుగుతుంది. కృత్రిమంగా చెట్లను నాటి పెంచడం కూడా జరుగుతుంది. నేరుగా విత్తనాలు నాటుతారు, లేక పాలిథీను సంచులలో గింజలను మొలిపించి ఆ మొక్కలను నాటుతారు.

చింత చెట్టుకు చీడలు పడతాయి, చెట్టు మీద లేక నిల్వ ఉంచినప్పుడు చింత పండుకి పురుగు పడుతుంది సాప్‌రాట్ (Sap-rot), వైట్‌రాట్ (White-rot) వ్యాధులు సోకడం వల్ల చింతపండు కుళ్ళిపోతుంది సకాలంలో వర్షాలు లేకపోయినా చింత చెడిపోతుంది అయినా చింతను నిర్వహించడం సులభం రోడ్ల మీద ఇరుప్రక్కల నీడకు వీటిని పెంచుతారు.

-సిఇఇ-ఎన్ఎఫ్ఎస్ సౌజన్యంతో

## మరణించిన రాజు తలపై బంగారు ముసుగు



*టుటాంఖామున్ ఈజిప్టు దేశపు రాజైన బాలుడు 9 సంవత్సరాలు పాలించి 1352 B.C. లో 18వ సంవత్సరం వయస్సులో మరణించాడు. ఇతడి భౌతిక శరీరం ఎంబామ్ చేయబడి ఒక దానిలో ఒకటి పట్టే మూడు పెట్టెలలో పెట్ట బడింది. పై రెండు పెట్టెలకు బంగారు రేకు తాపడం చేయబడింది. లోపలి పెట్టె పూర్తిగా బంగారంతో చేయబడింది. బంగారు రేకుతో చేయబడిన ముసుగును మరణించిన రాజు శిరస్సుపై అలంకరించారు. ఇదే రాజు అంత్య సంస్కారపు తల ముసుగు. 1922 లో హెూవర్డ్ కార్టర్ అనే బ్రిటిష్ పురావస్తు శాస్త్రజ్ఞుడు సమాధి లోపలి తలుపును పగులగొట్టినప్పుడు దీనిని కనుగొన్నాడు.*

"ఘనతను పొందడానికి వినయం ముఖ్యం."

# పక్షుల గుడ్లు

ఆర్.ఎల్.ఖన్నా

ప్రపంచపు వింతలలో పక్షుల గుడ్లు ఒకటి. ప్రకృతిని చూచి ఆనందించే వారికి గుడ్ల వివిధ వర్ణాలు, పరిమాణాలు, వాటిపై గుర్తులు చూస్తూంటే ఒళ్ళు జలదరించి పోతుంది.

పక్షులు గుడ్లు పెట్టడానికి నక్రమంగా కాలాన్ని అనుసరిస్తాయి. కొన్ని రకాల గ్రద్దలు, గూబలు,



సముద్రపు గల్సు రోజు విడిచి రోజు గుడ్లు పెడుతూంటాయి. రాబందులు, కాండోర్సు ఐదేసి రోజుల కాలవ్యవధిలో గుడ్లు పెడు తూంటాయి. మల్లీ (Malle) పెట్ట మొత్తం 9 రోజులలో గుడ్లను పెట్టేస్తుంది.

సామాన్యంగా ఒక పక్షి పెట్టే గుడ్ల సంఖ్య ఆ పక్షి ఆయుర్దాయాన్ని సూచిస్తుంది. దీర్ఘకాలం జీవించే గాన్నెట్ (gannet), ఆల్బట్రాస్ లేక పీట్ బాతులు ఒక సంవత్సరానికి ఒకే గుడ్డు పెడతాయి. స్వల్పకాలం జీవించే బాతులు ఒకేసారి 12 లేక 15 గుడ్లను పెడతాయి.

అడవి పక్షులు చాలామటుకు జతకూడే మగపక్షి లేకపోతే గుడ్లను పెట్టలేవు. కాని పెంపుడు పక్షులు, కోళ్ళు బాతులు, పావురాలు అలా కాదు. ఒక లెగ్‌హారన్ కోడి ఎనిమిది ఏళ్ళల్లో మగదాని సంబంధం లేకుండానే 1515 గుడ్లను పెట్టింది. హమ్మింగ్ పక్షుల గుడ్లు చాలా చిన్నవి. బటానీ గింజల సైజులో ఉంటాయి. ఒక ఔన్సులో 300వ వంతు బరువు ఉంటుంది. జీవించి ఉన్న పక్షులలో పెద్ద పెద్ద గుడ్లు ఆస్ట్రిచ్ పక్షులు పెడతాయి. ఇది సుమారు ఆరు మొదలు ఎనిమిది అంగుళాల పొడవుగా ఉండి, ఒక్కొక్కటి రెండు పౌండ్లు బరువు ఉంటుంది. దీన్ని ఉడక బెట్టడానికి 40 నిముషాలు పడుతుంది. ఆస్ట్రిచ్ గుడ్లు 20 కోడి పెట్టల గుడ్లు మొత్తం పరిమాణం ఉండి చిన్న హమ్మింగ్ పక్షి గుడ్డుకి 3,500 రెట్లు భారం ఉంటుంది. అన్ని పక్షుల గుడ్లు ఓవల్‌గా ఉండవు. గూడ్ల గూబల గుడ్లు, టౌకాన్స్ (toucans) గుడ్లు గోళాకారంగా ఉంటాయి. ముర్రెస్ (murres), ఆక్స్ (auks) గుడ్లు పియర్ (pear) పండు ఆకారంలో ఉంటాయి.

ఇప్పుడు ప్రస్తుతం 9,000 రకాల పక్షులు ఉన్నాయి. ప్రతిదాని గుడ్లు ప్రత్యేకమైన గుర్తులు, రంగులు కలిగి వేరు వేరుగా ఉంటాయి. తెరపబడి ఉన్న గూళ్లలో పెట్టే గుడ్లు చుక్కలు, చారలు, మచ్చలు కలిగి ఉంటాయి. గూటిలో గుడ్లు శత్రువులకు సులభంగా కనిపించవు. ఉదాహరణకి వుడ్‌కాక్ గుడ్లు ఇటుక రంగుతో, బూడిద రంగు మచ్చలు కలిగి ఉంటాయి.

రంధ్రాలలో పెట్టే కింగ్‌ఫిషర్స్, చిలుకలు, వడ్రంగి పిట్టలు, గుడ్ల గూబలు, షిఫ్ట్స్ మొదలైన

"పాము కోరలలో విషం పామును బాధింపనట్లు ఈశ్వరుని మాయ ఈశ్వరుని బాధింపదు, ప్రపంచాన్నంతా భ్రమింపజేస్తుంది."

వాటి గ్రుడ్లు స్వచ్ఛంగా పైన ఏ మచ్చలు లేకుండా తెల్లగా ఉంటాయి. చీకటి రంధ్రాలలో పెట్టబడే గ్రుడ్లకు రంగులు, మచ్చలు అనవసరం

పక్షులు వాటి గ్రుడ్లను అవి తెలుసుకోగలవా? అంటే కొన్ని రకాలు - టెర్న్స్ అనే పక్షులు వాటి గ్రుడ్లను అవి తెలుసుకోగలవు. కొన్ని రకాల పక్షులు గ్రుడ్లు గూటిలో నుంచి పడిపోతే వాటిని పోల్చుకోలేవు. కౌబర్డ్స్ అనే పక్షులు గ్రుడ్లను పొదగవు. కొన్ని చిన్న చిన్న ఇతర పక్షులు వీటిని పొదుగుతాయి.

సుమారు 80 రకాల పక్షులు పారసైటులు. ఇవి ఇతర పక్షుల గూళ్ళలో గ్రుడ్లను పెడతాయి. ఆ పక్షులే వాటిని పొదిగి పెంచుతాయి. ఇటువంటి వాటిలో సుప్రసిద్ధమైనవి యూరప్ మరియు ఆసియా దేశపు కోకిలలు మరియు అమెరికన్ కౌబర్డ్స్.

కొన్ని పాక్షికంగా ఇతర వాటిపై ఆధారపడి ఉంటాయి. ఇవి ఒక్కొక్కప్పుడు ఇతర పక్షుల గూళ్ళలో గ్రుడ్లను పెడతాయి. ముఖ్యంగా బాతులు ఇటువంటివే.

ఎక్కువ చుక్కలు గల వడ్రంగి పిట్టలు 10 రోజులలో గ్రుడ్లను పొదిగితే, కివి మరియు ఆల్బట్రాస్ 80 రోజులు పొదుగుతాయి. మల్లె (Malle) పక్షి గ్రుడ్లను 90 రోజులు పొదుగుతుంది.

చాలామటుకు పక్షి జాతిలో పొదగడం ఆడ పక్షులు చేస్తాయి. కొన్నిటిలో ఆడ, మగ పక్షులు రెండూ పొదుగుతాయి. అపురూపంగా కొన్నిటిలో మగపక్షే పొదుగుతుంది. విల్సన్స్ ఫాలారోప్ ఆడపక్షి, మగపక్షి కంటె చాలా పెద్దది. అదే మగదాన్ని పిలుస్తుంది. జత కూడటం అయిన తరువాత గూడు పెట్టవలసిన స్థలం ఇదే ఎన్నుకుంటుంది. మగపక్షి గూడు నిర్మిస్తుంది. అందులో ఆడది గ్రుడ్లు పెట్టేసి ఎగిరిపోతుంది. గ్రుడ్లను మగ పక్షులే పొదిగి పెంచాలి.

మామూలుగా మంచి మంచి రంగులు గల మగపక్షులు, వివర్ణంగా ఉండే ఆడపక్షులు గల జాతులలో ఆడపక్షి గ్రుడ్లను పొదుగుతుంది బాతులు, ఫెసెంట్స్, రఫ్స్ మొదలైనవన్నీ ఇటువంటివే. ఫాలారోస్ అనే వాటిలో పెట్టలు రంగు రంగులుగా ఉంటే, పుంజులు వివర్ణంగా ఉంటాయి. నైట్‌జార్స్ (nightjars), వేడర్స్ (waders) వంటి సరి సమానమైన రంగులు గల రెండు పక్షులూ పొదుగుతాయి. ఆడ ఆస్ట్రిచ్ పగటిపూట పొదిగితే, రాత్రిపూట మగది పొదుగుతుంది.

## ఒలింపిక్ ఆటలలో క్రికెట్



*క్రికెట్ ఒకసారి 1900లో ఒలింపిక్ క్రీడలలో చేర్చబడింది.*

"జయించగలమనే విశ్వాసం కలవారు తప్పక జయించి తీరుతారు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9. DESIKA ROAD. MYLAPORE. MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

